# మనిషికి - మనిషి

ఎల్. మాలకొండయ్య

ముద్రణ :

ప్రోగ్రెసివ్ ప్రెస్, ప్రయివేట్ లిమిటెడ్

ఆబిడ్స్, హైదరాబాదు - 500 001.

| | ప్రతులు : |
|---|---|
| మొదటి ముద్రణ 1974 | 3000 |
| రెండవ ముద్రణ 1979 | 1000 |

ప్రచురణ :

**వంశీ ఆర్ట్ థియేటర్స్,**

న్యూ నల్లకుంట, హైదరాబాద్-44,

వెల

గ్రంథాలయ ప్రతి

**రూ. 6-00**

సాధారణ ప్రతి

**రూ. 3-00**

# ఒక మాట

మనిషికి మనిషి ద్వేషాన్ని గాక, మమతను మాత్రమే పంచిపెట్టి మానవ సమాజాన్ని అభ్యుదయోన్ముఖంగా నడిపించాలన్న నా ఆశయమే ఈ కావ్యరూపం. సామాన్య మానవునికి అందుబాటులో ఉండే భాషద్వారా నా అనుభూతిని వ్యక్తీకరించడానికి ప్రయత్నించాను. ఈ ప్రయత్నంలో నన్ను ప్రోత్సహించిన అనేకమంది మిత్రులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని ముద్రించిన ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్, ముఖచిత్రాన్ని చిత్రించిన శ్రీ శీలా వీర్రాజు గార్లకు నా కృతజ్ఞతలు.

నవ్యరశ్మి కూర్చిన శ్రీ దాశరథి గారికి, పరామర్శచేసిన శ్రీ మధునాపంతుల సత్యనారాయణమూర్తి గారికి నేనెంతో ఋణపడి ఉన్నాను.

—మాలకొండయ్య

# పెంచినవారికి

నన్ను పెంచి
విద్యలు గరిపి
పెద్దవాడిని చేసిన
అక్క మాలకొండమ్మ
మామ పుల్లారెడ్డిగార్లకు—

# స వ్యా ర శ్మి

మాటల్లో చెప్పడానికి అసాధ్యమైన సూక్ష్మాంశాలను మాటల్లోనే చెప్పడానికి ప్రయత్నించడమే కవిత్వం. మనిషి అయిన మాలకొండయ్య గారు "మనిషికి మనిషి" లో విజయవంతంగా ఈ ప్రయోగం చేశారు.

వారి తొలిగ్రంథం జీవిత వలయాలు అనే సంపుటిలోని కవితలు మళ్ళీ మళ్ళీ, చదువుకొని నాలో నేను అనిర్వచనీయమైన మధురానుభూతిని పొందాను. వారి రెండవ గ్రంథం "మనిషికి మనిషి" లో మానవ హృదయంలోని మధురవేదనను మాటల్లో మూటకట్టారు మాల కొండయ్య గారు.

"విప్పితే ఊహానేత్రం
సముద్రపు లోతును కొలువవచ్చు
ఆకాశపు ఎత్తును అంచనా కట్టవచ్చు
అణువును చీల్చవచ్చు"

అన్నారు మాల కొండయ్యగారు. అన్నట్టు మనవాళ్ళు అణువును చీల్చనే చీల్చారు: (ఇప్పుడే అందినవార్త: 18.5.74: 2.0 p.m.)

చదవగానే నవ్వుతెప్పించి, ఆ పిమ్మట పాఠకుణ్ణి గంభీరుణ్ణి చేసి ఆలోచనా సముద్రంలో ముంచే కవిత లెన్నో "మనిషికి మనిషి" లో ఉన్నాయి. ఉదాహరణకి "విందులో—

"దేహానికి విందులు గావించి
ఆత్మను ఆకలితో ఉంచడం,
వంటావిడను మేపి
ఇంటావిడను పస్తుంచడం!"

పై పంక్తులు చదివి పకపకానవ్వుకొని, మళ్ళీ చదువుకుని ఆ నవ్వు మాయమై జిజ్ఞాసలో పడిపోతాడు పాఠకుడు.

"జీవరాసులు అన్నీ
అరగిస్తాయి ఒక్కొక్క పదార్థాన్నే,
అరగిస్తాడు జగతిలో అన్నిటినీ
మానవుడు మాత్రం"

ఇందులో కవి వాడిన "అరగించడం"లో నుంచి అనేకార్థాల్ని లాగవచ్చు. చిన్నచిన్న మాటల్లో మిన్నయైన భావాన్ని పొదగడాన్నే గొప్ప అన్నారు. విమర్శకులు. ఈ విశేషం వీరి కవితలో పదపదాన ప్రత్యక్ష మవుతుంది. ఈ కవిగారి చిన్నచిన్న కవితలు యెన్నెన్నో భావాంచలాలను మనోగగనాంగణాన యెగరేస్తాయి. "చాకిరేవు" లో :

"అపరాధిని పోలీసులు
పిడించి నేరాన్ని బయటికి లాగినట్లు
కక్కిస్తాడు చాకలి
మురికిని బయటికి !"

అంతేకాక

"చాకలి చేతి చాతుర్యం నుంచి
చాకిరేవు మహాత్వం నుంచి
మానవుడు నేర్చుకోవలసి ఉంది
ఎంతో జీవిత సత్యాన్ని"

అన్న చరణాన్ని ఆఖరున కూర్చారు కవి. ఇందులో-మనస్సును ఆకట్టుకునే వాస్తవికత. ఈ కవితకు సంపూర్ణ తను చేకూర్చింది.

నిరాడంబరంగా వుంటూనే మరపురాని అందాలను చిందే కవిత వీరిది. ఈయన ధ్యాస అంతా జిజ్ఞాస మీదే కాని ఎందరిలాగో అంత్యప్రాస మీద కాదు.

నవ్విస్తూ చురకలువేయడం మాలకొండయ్య గారికి ఉగ్గుతో పెట్టిన విద్య.

"కయ్యానికి బహుశః కారణాలుండవు
కారణాలు తెలిస్తే కయ్యాలే ఉండవు"

"చివరకు విషంలో కూడా కల్తీ అయితే
ఇక చచ్చేదెలాగు ?"

"త్రాగుడు గుణం స్పాంజీ లాంటిది
ఎంత ద్రవాన్నైనా పీల్చేస్తుంది"

"బ్యాంకులో దాచింది వస్తుంది వడ్డీతో తిరిగి:
పానశాలలో బ్రతుకే పోతుంది మునిగి"

"కట్టడాలకు మీటింగులు
పడగొట్టడాలకు మీటింగులు
అసలు మీటింగులు ఉండాలా లేదా అంటే
అది తేల్చడానికి పెట్టాలి మీటింగులు"

ఇలా–నవ్వించి, కవ్వించి, చురకలువేసి ఉరికించి, హృదయాన్ని కదిలించి, రసానందాన్ని అందించే పంక్తులు "మనిషికి మనిషి" లో కోకొల్లలు.

కవిత్వమంటే జీవితసారమనీ, జీవితాన్ని గురించి ఈ కవికి సమగ్రమైన దృష్టి వుందనీ 'మనిషికి మనిషి' చదువుతుంటే అవగతంకాక మానదు.

'జీవితమొక ప్రవాహం
పారుతుంది ఎగుడుదిగుడులతో
మిట్ట పల్లాలలో—వంకరటింకరగా'

'తెలియకుండా నేరం అనే పువ్వులో
దాగివుండే పిందే శిశు'

'శ్రమ అనే దాహానికి
విశ్రాంతి ఒక చల్లని పానీయం'

'ముందుగా తెలిసి వచ్చేది
ముసిలితనం ఒక్కటే; అయినా
తయారు కాడు మానవుడు
ముసలితనాన్ని ఆహ్వానించడానికి'

పై పంక్తుల లోతుల్లోకి వెళితే ఎన్నెన్నో నిత్య సత్యాలు, మహా రహస్యాలు నిగనిగలాడే నిజమైన ముత్యాలు మనకు దొరుకుతాయి.

మాలకొండయ్యగారి విద్యుత్ శైలి (Electric style) పాఠకుని నరనరాల్లోకి లిప్తలో చొచ్చుకుపోయి గుండెను కుదుపుతుంది.

'ప్రతి జీవరాశికీ మనిషి మనిషే
మనిషికి మాత్రం మనిషి మనిషికాదు'
'మనిషిని మనం ద్వేషిస్తే
ద్వేషం దహిస్తుంది మన హృదయాన్నే'

ఇక స్పష్టతకూ, సరళతకూ మాలకొండయ్యగారు పెట్టింది పేరు. సాధారణ అక్షరాస్యుడికి బోధపడే పదజాలమే ఈయన వాడతారు. ఎంతటి క్లిష్టమైన భావాన్నైనా పండువలిచి చేతిలో పెట్టినట్లు చెప్పడం వీరికివచ్చు. కొందరు యువకులు ఇంకా మాటల గారడీల రచనలు చేస్తున్నారు. అలాటివారు మాలకొండయ్య గారి కవితను మార్గదర్శకంగా పెట్టు కోవడం మంచిది.

మానవతను మరువవద్దని అడుగడుగునా హెచ్చరించే 'మనిషికి మనిషి' 'జీవిత వలయాలు' ప్రసరించే నూతన రశ్మి ఆరోగ్యవంతమైనది. మనిషిని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించే వాళ్ళుగా మసలుకోవాలని, తమ రచనల ద్వారా మాలకొండయ్యగారు ఉద్బోధిస్తున్నారు. ఇది ఋషి, చేయవలసిన కృషి, ఈక్రింది పంక్తులు నేను పదేపదే మననం చేసు కుంటాను. మీరూ చదివి ఆకళించుకోగలరని నాకు విశ్వాసంవుంది.

"మనిషిని తెలుసుకుని
మసలుకో గలిగితే—
అమానుషత్వం మాని
మనిషిని మనిషిగా చూడగలిగితే—
మనుషుల మనసులు
అమృత కలశాలు కాగలిగితే—
మారదా మనలోకం
కాదా శాంతికి నిలయం
మానవతకు ఆలయం"

—దాశరథి

# పరామర్శ

తెనుగులో వచనపద్యం అనే వినూతన ప్రక్రియ చేపట్టి సుప్రసిద్ధులైనవారు, సుప్రతీతులై వ్రాస్తున్నవారు లెక్కవేస్తే తక్కువ సంఖ్యలోనే ఉంటారు. ఏమార్గంలో వ్రాసినా. కవిత్వాంశం సహృదయుని గుండెకు పట్టుకుంటుంది. పాతధోరణిలో ఛాందసంగా వ్రాసుకునేవారికి కూడా తత్క్షణ మోహజనకమైన ఒక లక్షణం ఈ వచనపద్యంలో ఉండడం చూస్తే, ఆధునికకాలంలో ఈ ప్రక్రియయొక్క ప్రభావఝరి ఎంత వేగవంతమైనదో, అనిపిస్తుంది.

ఈ కొత్తమార్గంలో కొట్టవచ్చినట్లు కనబడే రంజక వ్యంజనాలు రెండు. వేడుక కలిగించే వాడుకభాష ఒకటి. శబ్దాలంకార ప్రాచుర్యము రెండు. వృత్త్యనుప్రాసము, యమకము, అంత్యానుప్రాసము దాని తళుకు బెళుకులు.

పాఠకుని మనస్సును సద్యఃకాలంలో చక్కిలిగింత పెట్టే ఒకానొక ప్రేయోమాధుర్యగుణం ఈ క్రొత్తమార్గంలో ఉండాలి: ఉన్నది. పత్రికలలో సభా రంగాలలో బహుజనావర్జనానికి ఈ గుణం ఉపకరణం.

నేడు వచనపద్యాలు వ్రాస్తున్న ప్రసిద్ధులలో శ్రీమాల కొండయ్య గారిపేరు అగ్రపంక్తికి చేరడానికి 'జీవితవలయాలు' అన్న గ్రంథం ముప్పాతికపాలు సహకరించింది. ఇపుడు 'మనిషికి మనిషి' అన్న రెండవ కబ్బం పండుగుమీద పబ్బం. అధికారులకు అధికావకాశం ఇవ్వవలసిఉన్న శ్రీ మాల కొండయ్యగారికి ఈ రచనలు చేయడానికి తీరుపాటు ఎప్పుడు! ఈ ప్రశ్న రచనానుభవం కలవాడెవ్వడూ వెయ్యడు వృత్తికీ చిత్తవృత్తికీ వేటేకాదు ఏనాడూ దవ్వు. ఆయన ఒకచోట అంటారు;

"నేర్పరితనం పుట్టుకతో రాదు
పెరగడంతో రాదు పువ్వులాగ
కృషిచేస్తే వస్తుంది వెన్నలాగ"

ఈ గ్రంథంలోని శీర్షికలు షష్టిపూర్తి మహోత్సవం చేసుకుని, పరువం తప్పకుండా నవకంగా ఉండి ఆకర్షిస్తున్నవి. 'ముసలితనం'లో ఒకచోట శ్రీ మాల కోండయ్యగారు వ్రాస్తారు :

"పళ్లు ఊడినా, తలనెరసినా
చూపు తగ్గినా, నడకసడలినా
మనసుమాత్రం మరువదు కుర్రతనాన్ని,
వయసు ముదిరినా, వగరు చావదంటారు."

ఇది ఎంతో సత్యమైన మాట.
వీరేశలింగము, వితంతువు మొదలైన శీర్షికలు ఆయన సంస్కరణవాంఛను స్పష్టపరుస్తున్నవి. ఎన్నో సాధారణ విషయాలు స్వీకరించి వ్రాసినా, కొన్ని ఉదాత్తమైన ధోరణిలో ఉండి రచయిత యొక్క అంతరంగం ఇట్టిదా అనిపిస్తుంది. 'చెట్లు' అన్న శీర్షిక చూస్తారుకదా !

'నేరాలతో మోసాలతో
విశ్రాంతిలేని ఈ లోకాన్ని
ఆహ్వానిస్తాయి అడవులు
ఋషులను పోషించే వనాలు
మనిషికి ఆనంద ధనాలు'

ఈ గ్రంథంలోని వచనాపద్యాలలో ఇట్టి పంక్తులెన్నో పట్టి చూప వచ్చు.

"అన్ని శ్రమలు పడడం
ఆఖరుకు విశ్రాంతిని పొందడానికే
జీవితంలో ప్రవహించే శ్రమ నదులన్ని
చివరకు కలిసేది విశ్రాంతి సాగరంలోనే"

'పోవచ్చు రావచ్చు' లో శ్రీ మాల కొండయ్యగారి ఊహ కొంత మచ్చు :

"పద్య కవిత్వం పోయింది
గేయ కవిత్వం వచ్చింది
గేయకవిత్వం పోయింది
గద్య కవిత్వం వచ్చింది
గద్య కవిత్వం పోవచ్చు
హద్దులు అసలే లేని
చోద్య కవిత్వం రావచ్చు"

ఏది యేమైనా, మనిషికి మనిషి సన్నిహితం కావాలనేది శ్రీమాలకొండయ్యగారి వచనసారం. మనుషులు కూడా ఈ ఉదారాశయానికి హార్ధమైన స్వాగతం ఇస్తారు.

రాజమండ్రి
24 5.74

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

# ఇందులో

# చాకిరేవు

వేస్తారు వేషాలు! చేస్తారు మోసాలు !
దుస్తులు చాకలివద్ద అరువుకు తెచ్చుకొని
మస్తుగ అనేక విద్యలు నేర్చుకొని
వేస్తారు వేషాలు! చేస్తారు మోసాలు !

చాకలి ఎలా చేస్తాడో వలువలు శుభ్రం
చాకిరేవు చూస్తే తెలుస్తుంది వాస్తవం.

బండలపై తడి బట్టలను చావ మోదుతాడు.
అపరాధిని పోలీసులు పీడించి
నేరాన్ని బయటికి లాగినట్టు
కక్కిస్తాడు చాకలి మురికిని బయటికి !
మురికి నీటిలో ఉతికి కూడా
చేస్తాడు బట్టలు శుభ్రం !

చాకలి చేతి చాతుర్యం నుంచి
చాకిరేవు మాహాత్మ్యం నుంచి
మానవుడు నేర్చుకోవలసి ఉంది
ఎంతో జీవిత సత్యాన్ని !

# మీటింగుల యుగం

అనవచ్చు నేటిది మీటింగుల యుగం అని!
మీటింగులు లేని రోజులు
ఈటింగులు లేని మీటింగులు అరుదులో అరుదు.
rarest of the rare.

పని చేపట్టాలన్నా మీటింగులే
చెడగొట్టాలన్నా మీటింగులే!
ఎలక్షన్‌లకు మీటింగులు! సెలక్షన్‌లకు మీటింగులు!
ఉద్యోగుల మీటింగులు
నిరుద్యోగుల మీటింగులు!
పుడితే పురిటి మీటింగులు
చస్తే సంతాపాల మీటింగులు!

కట్టడాలకు మీటింగులు
పడగొట్టడాలకు మీటింగులు!
పెళ్ళిచూపులకు మీటింగులు
విడాకుల వ్యవహారాలకు మీటింగులు!
మంచికీ మీటింగులే
చెడుకూ మీటింగులే!
మీటింగులు లేందే రోజు గడవనిది
మనం ఉంటున్న మోడర్న్ యుగం!
అసలు మీటింగులు ఉండాలా లేదా అంటే—
అది తేల్చడానికి పెట్టాలి మీటింగులు!

# ఆచారమూ - ఫ్యాషన్

నాటివారిని అనుకరించడం ఆచారం!
నేటివారిని అనుసరించడం ఫ్యాషన్!
ఆచారానికీ ఫ్యాషన్‌కి తేడా
నాడూ - నేడే

ఒకనాడు పొడుగాటి జుట్టులు
తరువాత పొట్టి కత్తిరింపులు
అటుపైని బోడిగుండ్లు!
తిరిగి పొట్టి, మళ్ళీ పొడుగు
ఆపైని బోడి!
అలాగే ఒంటికి బట్టలు,
నేలపై చెత్తఊడ్చే చీరలు
ఎక్కాయి కాళ్ళ నిచ్చెన మెట్లు
మెడమలు దాటి మోకాళ్ళపైకి!

ముంజేతుల క్రిందకు రవికలు
నింగిని తిలకిస్తూ
భుజాలపై కెక్కాయి
ఎవరెస్టును గెలిచినంత గర్వంతో!
బొడ్డుపైకి పోయిన చీరకట్టులు
పతనమై పోతున్నాయి,
అజంతా సుందరులతో పోటీ చేస్తూ

అడుగు ముందుకు వేయలేని
దూరం వెళ్ళి ఆగిపోయాయి!

మగవారి దుస్తులు మగువల మించాయి!
రంగురంగుల చొక్కాలు
రవికలో చీరలో తెలియని గురుషర్టులు!
అవసరానికి విప్పుకోవడానికి అలవిగాని
గొట్టాం పాంట్లు అబ్బాయిలకు,
విప్పడాని కేమీ మిగలని
మినీ డ్రెస్సులు అమ్మాయిలకు!

తిండిలో, నడకలో
తిన్నగా అన్నిట్లో ఫ్యాషన్ లే!
అవి నేర్వలేని వాళ్ళు
ఎందుకూ కొరగాని ఆచారపరులు!

అవన్ని నేర్చిన వాళ్ళు
నవనాగరిక శిఖామణులు!

ఆలోచించి చూస్తే
నేటి ఆచారమే నిన్నటి ఫ్యాషన్!
నేటి ఫ్యాషనే రేపటి ఆచారం!

# కాకి - కోకిల

కాకి చేసిన పాప మేమిటో
కోకిల చేసిన పుణ్యమేమిటో!

కాకి గూటిలో కోకిల గ్రుడ్లు పెట్టినా
కోకిల పిల్లల్ని కాకి పెంచినా
కొనియాడుతారు కోకిలనే అందరూ
కోపగించుతారు కాకి అంటేనే!

కాకీ నలుపే
కోకిలా నలుపే
కాకికీ కోకిలకూ తేడా
కూతలో మాత్రమే!

కాకి చేసిన అపకార మేమిటో
కోకిలమ్మ ఒరిగించిన ఉపకార మేమిటో!
కనలేని కారణం
కాకిని ద్వేషించడం
కోకిలను భూషించడం !

# కోరగాని కోరికలు

కోరికలు సుఖాన్ని పెంచుకోవడానికి!
ఫలితం? దుఃఖాన్ని పెంచుకోవడం!
కోరికలనే సౌఖ్యాలకు కొలతబద్దలు చేసుకుంటే
తీరికే ఉండదు మానవుడి స్వార్థానికి!

కోరికలు కొనసాగడానికి
మారుతాడు మానవుడు దానవుడుగా!
చేస్తాడు చెప్పరాని ఘోరకృత్యాలు
చంపుతాడు నీతి నియమాలను,
రూపుమాపుతాడు న్యాయాన్ని, ధర్మాన్ని!

కోరికలు తీస్తాయి త్వుదారులు
హరిస్తాయి ఇతరుల ప్రాణాలను కూడా!
కోరికల చీకటి కౌగిటిలో చిక్కినవాడు
దరిగానలేడు, వెలుగు చూడలేడు.
దాసుడు అవుతాడు ఆశా పాశాలకు,
దేవుడి సృష్టికి తన మంచికి విరుద్ధమైనా సరే
కోరుతాడు మానవుడు కోరగాని కోరికలు.

అందుకనే కత్తిరిస్తుండాలి అప్పుడప్పుడు
కోరికల విషపు గోరుల కొనలను,
ముకుత్రాడు లాగుతుండాలి మెలుకువతో
కోరికల కోడెదూడలను
ఆపడానికి వాటి దుడుకుతనాన్ని !

జీవితానికి కోరికలు అవసరమే అయినా
ఉంచుకోవాలి వాటిని హద్దుల్లో.
కోరికలు లేకుండా జీవించడమే కష్టం
కోరికలను చంపడం జీవితాన్ని విసర్జించడమే !

అయితే అంతులేని కోర్కెలు
అనర్థాలకు దారితీస్తాయి
వాటిని సరియైన మోతాదులో
తీర్చుకోవడంలో ఉంది తృప్తికి పునాది.
మానవుని కోర్కెలకు అంతు లేనప్పుడు
అతని శ్రమకు కొనలే వుండవు !

# మనిషికి దూరం

ప్రపంచపరిస్థితులన్నింటినీ
పరిశీలిస్తాడు మనిషి,
ప్రక్క ఇంటి వాని బ్రతుకు మాత్రం
పట్టించుకోడు మనిషి !

చంద్రుడు లక్షల మైళ్ళ దూరంలో వున్నా
చేరుతున్నాడు దగ్గరకు మనిషి క్షణంలో
ప్రత్యక్షంలో వున్న తోటి మానవుని
ఉంచుతున్నాడు దూరంగానే మనిషి !

పూజిస్తాడు మందలోని గోవును మనిషి
పోస్తాడు పాలు పుట్టలోని పాముకు మనిషి
మనిషిని మాత్రం అంట లేదు మనిషి. !

అన్నిటికీ దగ్గరే మనిషి
మనిషికి మాత్రం దూరం మనిషి !

# భయం

భయపడతారు ఎందరో నిజంగా,
భయమంటే ఇంటా ఒంటా లేదంటారు మరెందరో !
చేసిన నేరానికి చెల్లించే రుసుమే భయం !
మనం ద్వేషించే వాటికి భయపడతాం
భయపడేవాటిని ద్వేషిస్తాం.
ధైర్యం, సాహసం లాగే భయంకూడా
అపాయాలను ఎదుర్కోటానికి
భుజం తట్టి లేపేనేస్తం.
భయం మనిషిని పిరికివాడిని చేయడానికి కాదు
అవసరమైన మనోవాంఛలను
ఆపే బ్రేక్ లాంటిది భయం !
దూరదృష్టికి తల్లిలాంటిది భయం. !
నేరస్తులను వెంటాడుతుంది భయం
మంచివారిని చెడ్డపనులు చేయకుండా
హెచ్చరిస్తుంది భయం.
ధైర్యవంతులకు మరణం కంటే
పిరికివారికి బ్రతుకంటే ఎక్కువ భయం !
భయమనే భూతాన్ని తమలో దాచుకొని
భయబడతారు ఎక్కడో భూతముందని !
అన్యాయం అపకారం ఎరుగని వాళ్ళకు లేదు భయం.
అట్టివారు అసలు భయాన్నే గెలిచినవారు !

# సీసా

సీసాల్లో చిత్రం లేక పోలేదు
ద్రవపదార్థాన్ని మూటగట్ట గలుగుతుంది సీసా !
రకరకాల అందాల
రంగు రంగుల సీసాలు !
మందులకు సీసాలు
మాత్రలకు సీసాలు
పానీయాలకు సీసాలు
పాల సరఫరాకు సీసాలు !
సీసా లేకుంటే
పీసానికి కొరగాదు
ద్రవ పదార్థం !
సీసాలు రకరకాలు
స్త్రీలకు ప్రతి రూపాలు !
పొడుగు మెడలు! పొట్టి నడుములు
సన్నని పీకలు! నున్నని మేనులు
చిన్నదానికి, సీసాకు..
చిత్రమైన సామ్యం ఉంది
రెండూ కలిగిస్తాయి నిషా !
పట్టు తప్పినా
కట్టు విప్పినా
బ్రద్దలవుతుంది రెండిటి బ్రతుకూ !

# పోవచ్చు - రావచ్చు

రాజులు వెళ్లారు రైతులు వచ్చారు
రైతులు వెళ్ళారు కూలీలొచ్చరు
కూలీలు వెళ్ళొచ్చు భిక్షుగాళ్లు రావచ్చు !
పద్య కవిత్వం పోయింది గేయ కవిత్వం వచ్చింది
గేయకవిత్వం పోయింది గద్య కవిత్వం వచ్చింది
గద్యకవిత్వం పోవచ్చు హద్దులు అసలే లేని
చోద్యకవిత్వం రావచ్చు.
సంధ్యలు పోయాయి చదువులు వచ్చాయి
చదువులు పోయాయి సమ్మెలు వచ్చాయి
సమ్మెలు పోవచ్చు దొమ్మీలు రావచ్చు.
నాటకాలు పోయాయి సినిమాలు వచ్చాయి
సినిమాలు పోవచ్చు
చిల్లర నాట్యాలే కళా ఖండాలు కావచ్చు.
పొడుగు రవికెలు పోయాయి
పొట్టి బ్లౌజులు వచ్చాయి
పొట్టిబ్లౌజులు పోవచ్చు
వట్టి శరీరాలే మిగలొచ్చు.
మద్యపానం నిషేధించారు
నిషేధాన్ని విసర్జించారు.
మధువే మంచిది అనేశారు
మధువులు కూడా మలినం కావచ్చు
మనుషులు ఇక విషమే త్రాగొచ్చు!

# విందు

భోజనము, దాని ఖరీదు, పరిమాణం
కాజాలవు విందు—
అన్నం పెట్టేవారి ఆత్మీయతే
ఆహారాన్ని చేస్తుంది విందు !
ఇతరుల హృదయాలను చూరగొనడానికి
విందులే రహదారులు అంటారు అందుకే !
విందు చేయందే గోవిందుడైనా వరమియడుగా !

పొట్టనింపడానికే పెట్టిన విందు
వట్టి ఆ పూటవరకే !
దేహానికి విందులు గావించి
ఆత్మను ఆకలితో ఉంచడం
వంటావిడను మేపి
ఇంటావిడను పస్తుంచడం లాంటిది !

జీవరాసులు అన్నీ
ఆరగిస్తాయి ఒక్కొక్క పదార్థాన్నే,
ఆరగిస్తాడు జగతిలో అన్నిటినీ
మానవుడుమాత్రం !

# వెన్నెలకన్నె

పుచ్చ పువ్వులాంటి
పున్నమ వెన్నెల రాత్రి
అందాలు చిందే ఆ రాత్రి ప్రయాణంలో
అంతా అమృత ప్రాయమే!

ఆ పండువెన్నెల కన్నె కౌగిటిలో
ఆ వెల్లి విరిసిన జాబిలి చిరునవ్వులలో
అందిస్తుంది తరుణ హృదయం
అలపిస్తుంది ప్రణయ గీతం!

అందాలొలికే వెన్నెల మేలి ముసుగు
ప్రేలాడ వేసుకుని జాబిల్లి-
దారిపొడుగునా ,బారులు తీరి
నా కారువేగాన్ని కౌగిలించుకొంటూ
నా మెడలో తెలి మల్లెలమాలలు వేయాలని
శరవేగంతో పరుగులు తీస్తుంటే -

చెరువులు, తటాకాలు
వెన్నెల వెలుతురు కాంతుల్లో
మిలమిల, తళతళ మెరుస్తు ఉంటే
ప్రతిబింబిస్తున్నాడొక చంద్రుడు!
తొంగిచూస్తున్నాడు నీటిలోనుండి
వంగి నమస్కరిస్తున్నట్లున్నాడు

నింగిలో ఉన్న అసలు చంద్రుడికి
నేలపై ఉన్న ప్రాణమిత్రు లెందరో
నీరాజనం పట్టుతున్నట్లున్నారు !

పచ్చిక బయళ్ల తివాసీలకు
వచ్చింది ఎనలేని వన్నె
ఆ చల్లని వెన్నెలకన్నె కరస్పర్శతో
జంతు జాలాలు గంతులు వేశాయి
అంతులేని ఆనందంతో !

పక్షులు తమ వెచ్చని గూళ్ళలో
మస్తుగా ఆస్వాదించాయి
ఆ వెలలేని వెన్నెల మధుపానాన్ని.

ప్రయాణపు బడలిక పారిపోయింది—
ఆ వెన్నెలకన్నె చిరునవ్వుల బాణాలకు
ఆ తెలిమల్లెల సుందరి మందారాల చూపులకు
ఆ మిలమిల మెరిసే మేలిముసుగు చల్లని స్పర్శలకు.

# ప్రేమంటే

జీవితంలో మధురం ప్రేమ
జీవించడానికి ప్రాణం ప్రేమించడం
ప్రేమే దైవం - దైవమే ప్రేమ.
ప్రేమించేవారి హృదయమే భేదించరాని దుర్గం
అది విలువలేనిది-విలువ కట్టలేనిది.
కొనడానికి సాధ్యం కానిది అమ్మడానికి అసలే వీలు కానిది
తొలిచూపులో తొలకరిస్తుంది ప్రేమ
మలిచూపులోంచి గుర్తిస్తుంది మనసులో
ప్రేమ గుడ్డిదే అయినా అది చూడలేనిది లేదు !
రెండు జీవితాలను పెనవేసేది ప్రేమ
ఇహ పరాలను కలిపివేసేది ప్రేమ
పంతులులేకుండా నేర్చుకునే పాఠం ప్రేమ
పూవులోని తావిలాంటిది ప్రేమ.

ప్రేమ దాస్తుంది లోపాలను
అన్నింటిలో అందాలను చూస్తుంది ప్రేమ !
చిత్రకారు నిలా కనిపించే దృశ్యాలలోని
కనిపించని అందాలను చిత్రిస్తుంది ప్రేమ
ప్రేమను ధనంలా దాచుకోవాలి
సద్గుణంలా వినియోగించుకోవాలి !

సారామత్తు ఆ సాయంత్రంవరకే అయితే
ప్రేమమత్తు ప్రాణ మున్నంతవరకు !
ప్రేమించబడిన జీవితం ఉత్తమం !
ప్రేమించే జీవితం ఉత్తమోత్తమం !!

# స్వార్థం

స్వార్థాన్ని ఇతరులలో భరించలేరు ఎవరు
అయినా స్వార్థం లేనివారు లేనే లేరు !
స్వంతపనులను చేసుకుంటే కాదు స్వార్థం
ఇతరుల పనులను ఆపితే అవుతుంది స్వార్థం!

నిజమైన గొప్పతనం స్వార్థానికి స్వస్తిచెప్పకలగడం!
అది అందరికీ కాదు సాధ్యం.

ఎన్నో మంచినీటి నదులు
ఉప్పుసముద్రంలో కలిసిపోయినట్లు
ఎన్నో సుగుణాలు
స్వార్థంలో లీనమైపోతాయి !

నిద్రలాగ, స్వార్థం మనిషిని
ఏ నిమిషంలో పట్టుకుంటుందో తెలియదు.
స్వార్థం ఆవరించిన తర్వాత
అదే పరమార్థమై కూచుంటుంది !
కులదైవమై కులుకుతుంది !

ఆశ్చర్యమేమిటంటే - ప్రతివారు
తమలోని స్వార్థాన్ని ఆరాధిస్తారు దైవంగా !
ఇతరులలోని స్వార్థాన్ని ఆక్షేపిస్తారు దయ్యంగా !!

# కయ్యాలు

కయ్యానికి కాలుదువ్వే వాళ్లు
తోటాలు నింపిన తుపాకులు,
ఎప్పుడంటే అప్పుడే పేలవచ్చు !

తప్పంతా ఒక్కరిదే అయితే
కయ్యానికి కారణమే ఉండదు.

కయ్యం అనే పొయ్యిలో
బూతులనే బొగ్గులు పోస్తే
అది చిమ్మే నిప్పురవ్వలు
తన ముఖం పైకే చిందితే
చింతించి లాభం లేదు.

విరోధులమధ్య కయ్యాలు
తీస్తాయి ఇద్దరి ప్రాణాలు
చేస్తాయి లాభం మధ్యన వకీళ్ళకు.

కయ్యానికి బహుళః కారణాలుండవు
కారణాలు తెలిస్తే కయ్యాలే ఉండవు !

# పేదరికం

పేదరికం కాదు నేరం
అదొక మోయరాని భారం,

కలిమితో చెడు జీవనం కంటె
లేమితో మంచి జీవనం మేలు !
ప్రపంచాన్ని తెలుసుకోవడానకి
పేదరికమొక ప్రధాన సాధనం.

పేదరికంవల్ల ఎందరో మేధావులు
ప్రపంచానికే కాకుండా పోయారు.

ఈత నేర్చుకోవడానికి
మునిగి తేలడం ఎంత అవసరమో
జీవితం విజయవంతం కావడానికి
పేదరికం అనుభవించడం అంత అవసరం !

తక్కువఉన్న వారిని పేదలనే కంటే
ఎక్కువ కోరే వారిని పేదలనడం ఉచితం !
పేదవాళ్ళ పేదరికానికి
ధనికుల కలిమికి
కారణా లేమిటో ఆలోచించుకుంటే
పేదవాళ్లు తమ పేదరికానికి గర్వించనూవచ్చు.
ధనికులు తమ కలిమికి సిగ్గుపడనూవచ్చు !

విజ్ఞానవంతుడైన పేదవాడు
చదవబడని ఉత్తమ గ్రంథంలాంటి వాడు.

పేదరికంలోని గొప్పతనం
ఎవరినుంచీ అసూయపొందకుండడం !
పేదరికాన్ని భరించడం బాధాకరమైతే
పేదరికాన్ని పారద్రోల లేకపోవడం లజ్జాకరం !

చింపిరి పేలికల్లో చిన్న చిన్న తప్పులుకూడా కనిపిస్తాయి
విలువైన వలువలు అన్నిటినీ దాస్తాయి !
పేదరికం స్నేహితానికి, సంస్కృతికి గీటురాయి
ఉన్నవాళ్ళకు అందరూ స్నేహితులే!

మనిషికి సంతృప్తే కలిమి !
అసంతృప్తే పేదరికం !
పేదరికంలో సంతృప్తే కలిమి
కలిమిలో అసంతృప్తే పేదరికం!

# చెట్లు

మనుష్యులు పోట్లాడుకుంటుంటే
చెట్లు మాట్లాడుకుంటాయి !
చేస్తుంటాయి గుసగుసశబ్దాలు !
మనుష్యుల మూర్ఖత్వానికి
తమలో తామే నవ్వుకుంటాయి !

మనిషికి అక్కరలేని
మారణవాయువుల్ని స్వీకరించి,
ప్రాణికోటికి ప్రాణంపోసే
ప్రాణవాయువును ప్రసాదిస్తుంది చెట్టు.
శివుని కన్న అందుకే చెట్టుదే పై మెట్టు !

మనిషికి నిలువ నీడ నిస్తూ
తమచుట్టు జరుగుతూన్న మంచి చెడ్డలు
తగవులు తంటాలు మనుష్యులకేగాని
మాకు కావు అంటాయి చెట్లు!

మనిషికన్న ముందు పుట్టింది మ్రాను
మనిషి తర్వాత నిలిచేది చెట్టే.

ఋతువుకొక దుస్తులు మార్చి రకరకాల ఆకులతో
రంగురంగుల పూవులతో కలకలలాడుతాయి చెట్లు
సృష్టికే కళనిస్తాయి వృక్షాలు.

నేరాలతో, మోసాలతో, విశ్రాంతి లేని ఈ లోకాన్ని
ఆహ్వానిస్తాయి అడవులు,
ఋషులను పోషించే వనాలు మనిషికి ఆనంద ధనాలు.

# సంభాషణ

సంతోషదాయకం సంభాషణ
అనుభవించే విధానం తెలుసుకుంటే
హద్దులు, పద్దులు సరిదిద్దుకుంటే
తోడివారిని తూలనాడకుంటే— ॥సంతో॥

ఇంటి కష్టాలు. ఒంటిజబ్బులు వల్లించకుంటే
ఆత్మస్తుతి, పరనింద
అధిక ప్రసంగం, ఆపుకుంటే
అందరికి మాట్లాడే అవకాశమిస్తుంటే— ॥సంతో॥

ఎదుటివారు చెప్పేది శ్రద్ధగా వింటే
మధ్యలో మాటల కడ్డురాకుంటే
అప్రస్తుతపు అడ్డుగట్లు వేయకుంటే
పిట్టకథలు అసలు కథను పొట్టపెట్టుకోకుంటే ॥సంతో॥

హాస్యం అనే మసాలా
ఔచిత్యంగా వాడుకుంటే
కాదా సంభాషణ సంతోషదాయకం ?
లేదా మాధుర్యం మాటల ఆటల్లో ?

# తెలివి - సాధన

తెలియనిది తెలిసికొనే శక్తి తెలివి
తెలిసికోవచ్చు ఏదైనా సాధనతో,
నేర్పరితనం పుట్టుకతోరాదు,
పెరగడంతో రాదు పువ్వులాగ,
కృషిచేస్తే, తరచితే వస్తుంది వెన్నెలాగ.

సాధన చక్కదనాన్ని ఇస్తుంది స్వరానికి
అభ్యాసం అందాన్ని ఇస్తుంది ఆలాపనకు,
అభ్యసించవచ్చు ఎట్టివిద్యనైనా
గట్టి పట్టుదలా, ఆసక్తి ఉంటే.

ఉత్సాహాన్ని పెంచుకోవాలి
ప్రయత్నించి సాధించాలి తెలివితేటలు.

తెలివి ఒక రబ్బసొమ్ము కాదుకనుక
సంపాదించే హక్కుఉంది
సమాజంలో అందరికీ !
అందుకు రహదారి
తెలుసుకోవాలనే ప్రయత్నమే !

# బాధ్యతలు

మానవ జీవితంలో ఉండదు
బాధ్యతలేని సమయ మంటూ,

ఉదయం మేల్కొన్నప్పటి నుండీ
రాత్రి నిద్రపోయే వరకు
మనిషిని అంటిపెట్టుకొనే ఉంటుంది బాధ్యత,

పని మన చేతుల్లో ఉన్నా
ఫలితం పరిస్థితుల చేతుల్లో వుంటుంది.
బాధ్యతను నిర్వహించడమే మన కర్తవ్యం.

బాధ్యతలను సక్రమంగా నెరవేర్చడమే
జీవితంలో మన పాత్రలను నిర్వహించడం,
నేటి బాధ్యత నెరవేర్చిన దానికి ఫలితం
రేపటి బాధ్యతను నెరవేర్చేశక్తిని పొందడమే.

చిన్న చిన్న బాధ్యతలను నెరవేర్చడం
పెద్ద పెద్ద విజయాలకు పునాదులు వేయడం.

బాధ్యతలు నెరవేర్చడానికి
వెళ్ళనక్కరలేదు ఎక్కడికి
ఇంట్లో, ఆఫీసులో, పాఠశాలలో
అన్ని చోట్ల అవి మనవెంటనే ఉంటాయి కనిపెట్టుకొని

బాధ్యతలను నెరవేర్చేవారి హృదయాలు
సంతృప్తికి ఆలయాలు!
బాధ్యత గుర్తించనివాని చేతిలో
బంగారంకూడ అవుతుంది మట్టిపాలు!

# తిండి

శక్తి, తృప్తి ఇచ్చే తిండి
ఉంటుం దనుకోరాదు ఖరీదైన వస్తువుల్లోనే,
ఉంటుంది నిజంగా అది
తినేవారి హృదయాల్లోనే!

వెళ్ళ వచ్చు విలువైన విందులకు
తిరిగి రావాలి ఒక పిసరంత ఖాళీ
కడుపులో వుంచుకొని.

రోగాలకు మందులు కొలిచి పుచ్చుకున్నట్లే,
ఆరోగ్యానికి అన్నాన్ని కొలిచి తీసుకోవాలి.

ధనికుడికి పేదవాడికి తేడా——
ధనికుడు తన కిష్టమైనప్పుడు భోంచేస్తాడు.
పేదవాడు తనకు దొరికినప్పుడే తింటాడు.

భుజిస్తే శక్తికి మించి తీస్తుంది దారి అజీర్తికి.
అన్నంలేని వారికి ఆకలి జబ్బు ఒక్కటే!
అరగించుకోలేనంత తినేవారికి అన్నీ జబ్బులే!

మనం జీవించడానికి తినాలి
తినడానికి మాత్రమే జీవించరాదు!

# నరలోక నిజరూపం

కనువిప్పిచూస్తే కనిపిస్తారు మనుషులు
అగుపిస్తాయి వారి నిజస్వరూపాలు!
కడుపుకుపట్టెడు అన్నంలేని నిరుపేదలు
ఒంటికి జానెడు బట్ట లేని కడుబీదలు.

కాయ కష్టం చేయకుండా
ప్రజల దోచుకుండే వాళ్లు
చెవులుండి వినని వాళ్లు
కన్నులుండి చూడని వాళ్లు.

రోజంతా రెక్కాడినా, డొక్కనిండనివాళ్లు
ఒక్క నిముషమైన రెక్కాడకుండా
బొక్కసం నింపుకునేవాళ్లు—
కనిపిస్తారు కనువిప్పి చూస్తే.

కాలు కదపకుండా కండలు పెంచేవాళ్లు
కండలుకరిగించినా కడుపులు నిండనివాళ్లు
కనిపిస్తారు కనువిప్పిచూస్తే!
నమ్మలేం ఈ నరలోక స్వరూపం !

# పెనుభూతం

అంతులేని ఆఘాతం అనుమానం
అదే మనిషిని మింగే పెనుభూతం!
కారణాలు లేని నమ్మకాలే
ప్రాణాలు అనుమానాలకు.

మెరిసే దంతా బంగారం కానట్లే
కనిపించే వన్నీ కాజాలవు నిజాలు.
ఋజువులు లేని తలపులు
తలుపులు లేని లోగిళ్ళే!

అనుమానాలకు అలా చోటిస్తే
అపకారాలు ఇలా ప్రవేశిస్తాయి లోపలికి.
పెనవేసుకుంటాయి
అమాయకుల ప్రాణాలకు ఉచ్చుత్రాళ్లుగా!

అనుమానం సంతోషానికి శత్రువు
అనుమానించడం విద్రోహాన్ని ఆహ్వానించడమే.

అనుమానం నేరస్తుడిని వెంటాడుతుంది,
దొంగ చూస్తాడు ప్రతిపొదలోను
పొంచిఉన్న పోలీసు అధికారిని!

అనుమానం వీధిగుమ్మంలో ప్రవేశించగానే
నమ్మకం పెరటిదారిన పరుగిడుతుంది.

ఎప్పుడు అనుమానించే వారికి,
కాపలా వాడిలా కంటికి నిద్ర
వంటికి విశ్రాంతి ఉండదు.
పిరికివారి ప్రత్యేకత
ఇతరులను అనుమానించడమే !

అనుమానానికి పునాది అజ్ఞానం
స్నేహ పుష్పానికి విష కీటకం అనుమానం
దానికి నిర్మూలం నిజాన్ని గ్రహించడమే.
రహస్యంగా ఇతరులను నిందించడమే
బహిరంగంగా వారిని అనుమానించడం.

ఆలోచనల్లో అనుమానాలు
పక్షుల్లో గబ్బిలాల్లాగే !
అవి చీకట్లోనే గాని వెలుతురులో చరించవు
అనుమానాలు హృద్రోగాలు
అటుపైని అవి అంటుజాడ్యాలు !

మనం అనుమానిస్తే కొందరిని
మనలను అనుమానిస్తారు అందరు !



# చచ్చే దెలాగు

ప్రపంచమంతా ఒక నాటకం
ఎక్కడ చూచినా ఒక బూటకం
చూపే నమూనా ఒకటి
అమ్మే సరుకు మరొకటి.

చూస్తే తళతళ మెరుపు
వాడితే తెలుస్తుంది వస్తువు సత్తా!

అన్ని మందుల్లోను కల్తీ
అసలు జబ్బులకన్న కల్తీ మందులే
కాజేస్తున్నాయి రోగుల ప్రాణాలను !

బియ్యంలో రాళ్ళ కల్తీ
నేతిలో గడ్డిమూనె కల్తీ
బెల్లంలో పేడ కల్తీ
ఆవాలులో ఇసుక కల్తీ
ఉప్పులో మట్టి కల్తీ
పాలల్లో నీళ్ళ కల్తీ
కాఫీలో బొప్పాయి గింజల కల్తీ.
ఐస్ క్రీములో బ్లాటింగ్ పేపరు కల్తీ
ఇంకా ఎన్నిట్లోనో కల్తీ
చివరకు విషంలో కూడా కల్తీ అయితే
ఇక చచ్చే దెలాగు ?

# పరీక్షలు

విద్యార్థులు బుద్ధి మంతులే
ఉపాధ్యాయులు నేర్పరులే
కాని —

గడ్డు సమస్య ఎక్కడంటే —
పాఠాలు చెప్పడంలోను
పుస్తకాలు చదవడంలోను,
పరీక్షలు నడపడంలోను
కాపీలు మానడంలోను !
విద్య నేర్పే వారికి ఉండాలి
విద్యార్థి శ్రేయస్సు ధ్యేయంగా
విద్య నేర్చుకునే వారు గుర్తించాలి
విద్య యొక్క అవసరం, విలువ.
బోధించే వారికీ పఠించే వారికీ
పొత్తు కుదరకుంటే
ఫలితం ? గోడల మీద వ్రాతలు,
వీధుల్లో ప్రదర్శనలు.
నెల జీతాలకు పాఠాల బోధన
డిగ్రీ సంపాదనకు చదువు అయితే
బోధించేది బుర్రకెక్కుతుందా ?
బుర్రకెక్కించడానికి ప్రయత్నమైనా ఉంటుందా ?
అప్పుడు —
బోధించడ మొక బుద్ధి మాలిన పని !
పరీక్షలొక పరమదండుగ విన్యాసం !

# వితంతువు

తంతువు (తాడు) లేనిది వితంతువు.
తాడుగట్టిన మగడు మరణిస్తే
తెంచుతారు ఆ తాడు
అవుతుంది ఆమె వితంతువు.

చెప్పుతారు విధవల ముఖం చూస్తే
అవుతుంది అశుభం అని,
సధవల చూస్తే శుభం అని.

నుదుట బొట్టు, శిగలో పూలు
ఇస్తాయి అందాన్ని
విధవలకైనా, సధవలకైనా.

పెళ్ళితో వచ్చేది మంగళ సూత్రమే అయితే
పెనిమిటితో పోయేది
ఆ తాడు మాత్రమే కావాలి కదా ?

పుట్టినప్పటి నుండి వున్న
పూలు, పసుపు, కుంకుమ
అందమైన కురులు - అలంకరణలు - అన్ని
ఎందుకు వదలాలి ? ఎవరి కోసం మానాలి ?

ఆ పైని విధవ ముఖం చూడరా దని
అంతు లెందుకు విధించాలి ?
ఆధారాలు లేని నమ్మకాలతో
ఆడవారిని విధవ లనీ, సధవ లనీ
విభజించడం
కాదా అన్యాయం స్త్రీ జాతికే ?

జీవిత భాగస్వామి మట్టిలో కలిస్తే
మళ్ళీ సుఖ జీవనానికి .
మగవాడికున్న హక్కు
మగువకు ఎందుకు ఉండరాదు ?

భర్త మరణానికి
భార్య మెడలోని తాడు తెంచడానికి
సంబంధం కొంత ఉన్నా —

భార్యను కురూపిగాను
అపశకునాల కుప్పగాను
చిత్రించడం కాదా
మానవత్వానికే అవమానం ?

# వీరేశలింగం

శారీరక బలహీనతకు
ఆర్థిక మాంద్యతకు - తోడు
చిన్న బడి పంతులు ఉద్యోగం.

కలుపు కమ్మిన చేనులాగ
అర్థంలేని ఆచారాలతో,
ఆధారం లేని నమ్మకాలతో
స్వార్థ పరులతో సంఘ వినాశకులతో
దురాచారాల దుర్బుద్ధులతో
కలుషితమైవున్న ఆ నాటి సంఘం !

అంతా గద్దలు, రాబందులే
ఆ రాచిలుక చుట్టూ -
అన్నీ తోడేళ్లు, బెబ్బులులే
ఆ కుందేలు చుట్టూ -
ఎంత ధైర్యం ఆ పాల పిట్టకు !
ఎగిరి తన్నింది గద్దనే గద్దించి !

మూఢ నమ్మకాలపై చేశాడు దాడి
బాల విధవలకు పెట్టాడు నొసట బొట్టు
తుంచాడు కులమత బేధాలను కూకటి వేళ్ళతో
ఎదుర్కొన్నాడు అన్ని దురాచారాలను.

వృద్ధ పురుషులు వ్యభిచరించవచ్చు
బాల వితంతువులకు మళ్ళీ కారాదు పెళ్ళి
అనే మూర్ఖులకు వడ్డించాడు ఎడా, పెడా
నేర్పాడు బుద్ధి -

ఈ సంఘ సంస్కరణ సమరంలో
మూఢ నమ్మకాలపై దాడిలో
వాడాడు వాడిగల ఆయుధాలు
చూపాడు కత్తి కంటే కలమే కరుకు అని.
డాలుకంటే పుస్తకమే మేలు-అని
మందుగుండుకంటే మనసే గొప్పఅని !

మంపాడు మాయని మచ్చలను
మార్చాడు మనిషిని మనీషిగా
తెలుగు జనకోటి హృదయ పేటికల్లో
నిలిచాడు వందనీయుడుగా వీరేశలింగం !

# సన్మానాలు

ఏమిటీ సన్మానాలు
ఎందుకీ సన్మానాలు
కావాలా సందర్భాలు
చేయడానికి సన్మానాలు ?

చేస్తే అన్నిటికీ సన్మానాలే
పుస్తకం అచ్చువేస్తే సన్మానం
పుణ్యక్షేత్రాలు చుట్టివస్తే సన్మానం
ఏరుదాటితే సన్మానం
గట్టు ఎక్కితే సన్మానం

పెళ్ళి చేసుకుంటే సన్మానం.
పిల్లలు పుట్టితే సన్మానం.
పరీక్షలో పాసయినా సన్మానం
ఉద్యోగం వచ్చినా, ప్రమోషన్ దొరికినా సన్మానం

నీటిలో మునిగి తేలినా ఏటిలో ఈదినా సన్మానం
పర్వత శిఖరమెక్కినా పడకుండా దిగినా సన్మానం
పాదయాత్ర చేసినా బంతి భోజనం పెట్టినా సన్మానాలే.

ఎన్నికల్లో నెగ్గినా - పన్నాగాల్లో గెలిచినా
పత్రికల్లో పేరు పడినా అన్నిటికీ సన్మానాలే
సన్మానాల పేరుతో సంతర్పణలు

సంతర్పణల పేరుతో
సంగీత కచ్చేరీలు.

సన్మానాలు, సంతర్పణలు
సంగీత కచ్చేరీలు——
విందులు వినోదాలు
ఆనందించడానికి అనేక సాకులు !

సన్మానం పొందే అర్హతను
సంపాదించుకోవడం కన్న
సన్మానం మరి వేరే ఏముంది ?
అది లేనినాడు ఏ సన్మానమైనా
కాదా అవమానం క్రిందనే జమ !

# వైరాగ్యం

ఎవరికి, ఎప్పుడు, ఎలా
పుట్టుకొస్తుందో వైరాగ్యం చెప్పలేం,
కారణాలు అనేకా లుంటాయి
కట్టడానికి కాషాయ బట్టలు.

కట్టినంత మాత్రాన కాషాయ బట్టలు
కాలేరు విరాగులు,
బైరాగి వేషధారు లంతా విరాగులైతే
ముంచుకొస్తుందెందుకో ముక్కోపం
ముష్టి కొంచెం దొరక్కపోతే !

శవాన్ని చూడగానే
శరీరం గగుర్పొడుస్తుంది
శ్మశాన వైరాగ్యం పుట్టుకొస్తుంది
విరక్తి వెల్లివిరుస్తుంది జీవితం పైని ?

ఛీ! ఎందుకీ మమకారం ఈ అల్ప జీవితానికి
ఎంతటివారికైనా ఇంతేగతి కాదా-అని.

కాన్పుల బాధపడలేక
కలుగుతుంది వైరాగ్యం
వద్దురా బాబు ఇక ఈ పిల్లలు
చాలును ఇద్దరు రాక్షసులు-అని!

పుట్టుకొస్తుంది పురాణ వైరాగ్యం
వెల్లులి శాస్త్రిపురాణ కాలక్షేపం విన్నప్పుడు,
అది ఉంటుంది ఇల్లుచేరే దాకే
మళ్ళీ మామూలు వెల్లులిపోపు దొరికేదాకా.

కాలం కొంత గడవంగానే
అంతా (అసలు) పాతకథే!
అన్ని సౌఖ్యాలతో జీవించాలి.
ఎన్నో విధాలుగా ధనం సంపాదించాలి!

ప్రేమించాలి, పిల్లల్ని కనాలి
శ్మశాన, పురాణ, ప్రసూతి వైరాగ్యాల,
తాకిడి మళ్ళీ తగిలేవరకు!

వైరాగ్యం పేరుతో విధినిర్వాహణ
విస్మరిస్తే కలుగుతుందా విముక్తి?
బూడిద పూసుకొని
బుర్ర చంకన పెట్టుకున్నంత మాత్రాన
రాజాలదు బైరాగి- రాజాలదు వైరాగ్యం.

అనుకున్నది అందితే అనురాగం!
అది అందకుంటే వైరాగ్యం!!
మానవధర్మాన్ని మరువకుండడమే
కాదా నిజమైన వైరాగ్యం?

# చేపలు

ప్రకృతి విచిత్రంగా ఉంటుంది -
పరికించి చూస్తే చేపల జీవితం
నీటిలోనే గాని వాటికి దొరకదు
సూటిగా వలసిన ప్రాణవాయువు.

నీరుదాటి నేలమీద పడితే
ఒడ్డునపడ్డ ఓడల్లాగే వాటిబ్రతుకు.

పోలుస్తారు కవులు అతివల కను దోయిని
సుందరమైన చేపల ఆకారంతో
వర్ణిస్తారు వనితలను "మచ్చకంటి", "మీనాక్షి" అని.
పూబోడుల కన్నులతో పోలికలు
కలిగిస్తాయా చేపలకు గిలిగింతలు!

జెస్తవాళ్లు వేస్తారు గాలాలు తగిలించి మంచి ఎఱలు,
చేరుతాయి చేపలు ఆత్రులుచాచి ఆశతో,
ఆశే అవుతుంది వాటికి వినాశకారణం.

కన్నులతో చూస్తే అందం చేపలు
వాసనచూస్తే దుర్గంధం చేపలు
వర్ణిస్తే కవితావస్తువు చేపలు
వడ్డిస్తే భోజన వస్తువు చేపలు!

అయితే లేదు కొందరికి లైసెన్సు
బహిరంగంగా చవిచూచేటందుకు వాటిని
అందుకే దొరికితే చేపలు
ఆరగిస్తారు దొంగచాటుగా అట్టివారు!

# బెస్తవాళ్లు

సంధ్య వేళ వెళ్ళుతారు బెస్తవాళ్ళు
సముద్రంలోకి చేపల వేటకు,
మరునాటి మధ్యాహ్నం తిరిగివస్తారు పేటకు.

ఒంటి కాలి మీద జపంతో
మింటికి మంటికి గాని అగాధపు జలాల్లో
ఆడుతారు వేట అలసట ఎరుగక ఆశతో
ఉన్నది నడి సముద్రంలో అయినా
ఉండవు (మంచి) నీళ్ళు త్రాగడానికైనా.

పచ్చి చేపలే పరమాన్నంగా
భక్షించి నావను లాగుతాడు
ఆటుకు, పాటుకు దాసుడై
అమావాస్య పున్నములకు నమస్సులు చేసి.

ఊళ్ళో పోలేరమ్మకు
ఊరి వెలుపల అంకాళమ్మకు
ఉపాసనలు చేసుకుని
సముద్రుడికి సాష్టాంగం చేసి—
నడుపుతాడు తెడ్డు, తెరలేని నావను నడిసముద్రం
లోనికి

భార్యా బిడ్డలను గట్టున విడిచి
భారం దేవుడిపై వేసి.

ఇంటి వాళ్ళు ఉంటారు
కళ్లల్లో దివ్వెలు పెట్టుకొని
పిడికిట్లో ప్రాణాలు దాచుకుని
"వస్తాడు మన బెస్తవాడు
తెస్తాడు చేపల మూటలు" అనుకొంటూ.

అతడు తెచ్చేది అందమైన చేపలనే అయినా
ఇస్తారా తన శ్రమకు తగ్గ విలువ ?
గడుస్తుందా ఈ బెస్తవాని జీవితం
నడుస్తుందా వానికుటుంబనావ?
చేరుతుందా అది సుఖసంపదల దరి?
మరి లేక, అతడికి మిగిలేది ఎప్పటిలాగే
గోచిపాత రాయుడి జీవితమేనా ?

ఆఫీసుకు వెళ్ళినవాళ్లు
ఇంటికి తిరిగి వచ్చే అవకాశమున్నా లేకున్నా
ఆశిస్తారు భార్యా, పిల్లలు
అతడు క్షేమంగా చేరుతాడు ఇల్లు అని-
సముద్రంలోనికి వెళ్ళిన బెస్తవాళ్ళ
భార్యా పిల్లలు ఉంటారు
కళ్లల్లో దివ్వెలు పెట్టుకొని అతనికై కాచుకొని.

అందుకే అంటారు
అన్ని వృత్తుల్లోను అపాయకరం
బెస్త వాళ్ళ సముద్రంలో వేట వృత్తి అని.

# బూటకపు నాటకం

లోకమంతా ఒక నాటకం
చేసే పనులన్నీ బూటకం

కట్టేది కాషాయ వస్త్రం
పట్టేది స్వార్థానికి ఛత్రం
త్రిప్పేది రుద్రాక్షమాల
విప్పేది ఉదర పోషణ పంచాంగం !

తిరిగేది పుణ్యక్షేత్రాలకు
మరిగేది కామినీ కనక సుఖాలను
చెప్పేవి శ్రీరంగ నీతులు
చేసేవి చెప్పరాని చేతలు—

విభూతి నుదుట
కమండలం చేత—

యోగదండం చంకన
జటాజూటం తలపైన
ఆకారం అపర పరమేశ్వరుడిది !
అవతారం అవినీతి పరుడిది !!
అంతా ఒక బూటకపు నాటకం ! ! !

# జీవిత ప్రయాణం

జీవితమొక ప్రవాహం
పారుతుంది ఎగుడు దిగుడులతో
మిట్ట పల్లాలలో -వంకరటింకరగా.
జీవితమొక సంగీత పాఠం
సృజించలేం శ్రుతిని శాసించి
ఆలాపన అలవడుతుంది తనంతట తానే
సాధన సానబెట్టడానికే.
జీవితమొక అచ్చెరువుల పూలమాల
అన్ని పువ్వులు కలిస్తేనే
అది అవుతుంది అందాల గుచ్ఛం,
అంత పని, ఇంత నిద్ర కొంత ప్రేమతోనే
ముగించరాదు జీవిత ప్రయాణం.
మానవజీవిత మొక ప్రణాళిక
దిన క్రమంగా అమలుజేయాలి దాన్ని,
ఉపయోగంలేని జీవితం అకాలమరణంతో సమానం.
జీవితం కాదు వినోదం - అయినా కాదు విషాదం
అదొక ధైర్య సాహసాల రథయాత్ర
కొనసాగుతుంది శక్తి, యుక్తి చక్రాలపై.
జీవితయాత్ర లక్ష్యం
తోటివారి హృదయ ప్రమిదల్లో
వికాసపు వత్తులను వెలిగించడమే !

# ఎవరు గొప్ప

స్త్రీయా - పురుషుడా
ఆమెయా - అతడా
ఎవరు ముందు - ఎవరు గొప్ప ?

స్త్రీపురుషులు కారా అర్ధనారీశ్వరులు ?
ఆవిడ ఆదిశక్తి - అతడు ఆమెభర్త

ఆమె మూలపుటమ్మ
అతడు ఆదిపురుషుడు
ఆమె అన్నపూర్ణ
అతడు అన్న స్వరూపం.
ఆమె గొప్పా ? అతడు గొప్పా ?

ఇల్లు - ఇల్లాలు అంటాం
భార్య - భర్త అంటాం
భార్య దాసీగా ఉంటే ఇల్లు ఇల్లా ?
భర్త అర్ధనారీశ్వరుడా ?

ఇద్దరూ ఒకటైనప్పుడు
సద్దుగా సంసారం చేసేటప్పుడు
ఎవరు ముందు - ఎవరు వెనుక ?
ఎవరు - గొప్పా, ఎవరు తగ్గు ?

# ద్వేషం

ద్వేషం హృదయంలో రగిలే వెర్రి జాడ్యం,
మనిషిని మనం ద్వేషిస్తే
ద్వేషం దహిస్తుంది మన హృదయాన్నే.

"ద్వేషించకు మనిషిని
ద్వేషించు మనిషిలోని ద్వేషాన్ని" అన్నారు పెద్దలు.
ద్వేష మొక మందు నింపిన తుపాకి
దొరుకుతుంది గురిపెట్టడానికి ఏదో ఒకటి.

పరద్వేషం స్వయం పతనమే!
ఇతరుల ద్వేషించడం
ఎలుకను చంపడానికి ఇల్లు కాల్చుకోవడమే !

ద్వేషాన్ని హృదయంలో నింపుకోవడం
కొరివితో తల గోకి కోవడమే.
ద్వేషం నీచుల సంకుచిత బుద్ధికి నిదర్శనం.

ద్వేషించడానికి కారణాలంటూ ఉండవు
మనకు తెలియరు గనుక ఇతరులను ద్వేషిస్తాం.
ద్వేషిస్తాం గనుక వారిని తెలుసుకోలేం.
కాబట్టి ద్వేషానికి మందు మంచి ప్రేమే !

# కవి - రవి

కవి చూచేది కనిపించని రహస్యం
రవి చూచేది కనిపించే సత్యం.

నిజాన్ని చూడలేని కవికి నిజాన్నే చూసే రవికి
హాస్యానికైనా కనిపించదు సామ్యం !

మూర్ఖుడిని జ్ఞానిగా నీచుడిని శీలవంతుడిగా
అమాయకుడిని వివేకిగా
దుర్మార్గుడిని సద్గుణ రాశిగా
నియంతను పరిజాస్వామ్యుడుగా
మెల్లకంటి దానిని కలువకంటిగా
చిత్రించి వర్ణించేకవి
వాస్తవానికి రవికాదు గదా
అసలు కవే కాజాలడు!

తనకు నచ్చినవాడు చంద్రుడు
తనను ఆదరించినవాడు ఇంద్రుడు
అని వ్రాస్తే అబద్ధాలు అవుతుందా అది కవిత్వం ?
చేకూరుతుందా చీకటిలో ప్రాకులాడితే కవిచంద్రత్వం?

చూస్తాడా రవి చూడలేని చోటు కవి ?
వ్రాస్తాడా చూచింది చూచినట్లు కవి ?
కవిత్వం నిజమైన వెన్నెలై కాయాలి
అడవిలో కాక ఆశ్రిత జనావళిపై !
సాహిత్యం పన్నీరై కురియాలి
బూడిదలోకాక బుద్బుద ప్రాయులపై !

# ఏది కొలతబద్ద

మనిషికి, మనిషి మనసుకి
ఏది కొలత బద్ద ?
మతమా, కులమా
భాషా, వేషమా ?

చర్మపు వర్ణమా
ధరించే దుస్తులా
చెప్పే నీతులా
చేసే వృత్తులా ?

మనిషికి మనిషికి మధ్య ఉండవచ్చు తేడా
విజ్ఞానంలో, విద్యాభ్యాసంలో
వృత్తిలో, ప్రవృత్తిలో.
అయినా కొలుస్తుంది విభేదాలను నేటి సమాజం
అర్థంలేని ఆ నాటి కొలతబద్దతోనే !

కాదా కులంకంటే గుణమే ప్రధానం ?
లేదా చోటు వ్యక్తి సంస్కృతికి, విలువలకు ?
నేటి సమాజం కొలిచే ఆనాటి కొలతబద్ద
కాదా అన్యాయం తోటి మానవుడికి ?

# వలువ విలువ

దుస్తులు లేని శరీరం
కళేబరం లేని ప్రాణం!
బట్టల్లో దాగినంత కాలం
బహు విలువ శరీరానికి!

ముసుగుతీసిన మోము
మబ్బు విడిచిన ఆకాశం
కావా ఆకర్షణ విహీనాలు ?

కొంచెమైనా దుస్తులులేని శరీరం
కాదా ఉప్పులేని వంటకం ?

వలువ ఉన్నంత కాలం
వళ్లు చూడా లనిపిస్తుంది.
ఒడలు నగ్నమైతే
మళ్ళీ చూడా లనిపిస్తుందా ?

అందానికి ప్రాణం వస్త్రం !
ఆకారానికి విలువ వలువ !!

# ఆశావలయం

పదవి కావలసిన నాడు
పనులు నెరవేరవలసి నప్పుడు
ఎన్నికల గెలుపుకు
ఉద్యోగంలో చేరికకు
వెళ్లుతారు జోస్యుల వెంబడి
చేస్తారు జోస్యులు చెప్పినవన్నీ.

అన్నీ కావాలనీ - అన్నిట్లో గెలవాలనీ
ఆశావలయంలో చిక్కుకొని
కనలేరు మంచీ, చెడూ
నమ్ముతారు తమకు మంచిగా ఉన్నమాటలన్నీ.
"మీరు కోరింది అవుతుంది" అని చెప్పితే చాలు
కడుపు నిండుతుంది,
నింపుతారు జోతిష్కుల పర్సులు.

మూఢ విశ్వాసంతో
మోసగించుకుంటారు తమనుతామే.
తన బ్రతుకు తనకే తెలియని జ్యోతిష్కుడు
లోకు లందరి భావిజీవితాల
లోతులు చూడగలడా ?
వారికి విజయాలు చేకూర్చగలడా?

# ఎర్రి దీపం

కావాలంటే సిరిసంపదలు
కోరాలి చిరు సంసారం.

మంది ఎక్కువైతే మజ్జిగ పలచన లాగే
ఎక్కుమందిని కంటే తక్కువ సుఖమే దక్కేది.

ఇంటికి ఇద్దరు పిల్లలు ముద్దు
తక్కువ విత్తనం విత్తడం
చిక్కని మడిలో కలుపు తీయడం
చక్కని ఎరువులు వేయడం
అందుకే - అందమైన సౌఖ్యాన్ని పొందడానికే !

కావాలంటే పరిమిత కుటుంబం
ఉన్నారు వైద్యులు
చేస్తారు ఆపరేషన్లు హాని లేకుండా !
డాక్టర్లు చేయాలంటే ఆపరేషను
దంపతులు ఇవ్వాలి కోపరేషను.

కర్మకు కారకులం మనమైతే
ఫలితానికి నిందించేది విధినా ?
ఎంత చక్కని అపనింద ఆ నోరు లేని విధిపైని !

ఇది తరుణమా ఇంకో బిడ్డని కనడానికి ?
కాదా సమయం మీ ఇద్దరి
ముద్దుముచ్చలు తీర్చుకోవడానికి ?

ఇంకా బిడ్డలను కని
నిరుద్యోగ సమస్యకు దీర్ఘం దిద్దుతావా
హనుమంతుడి తోకలాగ ?

కార్య మనే మర్యాద పేరుతో జరిపే
గర్భాధాన సంబరానికి చేసే పండుగలాగే
చేయాలి గర్భాన్ని నిరోధించే
వ్యాసక్టమీ, ట్యూబెక్టమీల పండుగలు.

ఇక మీద ఇవ్వాలి పెళ్ళి కొడుకు కూతుళ్ళకు
గర్భ నిరోధక పరికరాలను బహుమతులుగా
దీవించాలి దంపతులను "ఇద్దరు పిల్లలనే కనాలి" అని.

అందుకు కలపాలి అందరం చేతులు
"మే మిద్దరం - మా కిద్దరూచాలు'' అని
వెలిగించాలి ఎర్ర దీపం
ఆపించాలి పుట్టుకల బండిని !

# సుఖం, సంతోషం

సుఖం-సంతోషం - వేరు వేరు.

ఇహ సంపదలు ఇవ్వగలవు సుఖాన్ని.
సుఖం ఇవ్వ లేక పోవచ్చు సంతోషాన్ని ఎల్లప్పుడు.

ధనం, ధాన్యం, విద్యా ఉంటే
పొందవచ్చు సుఖాన్ని.

అన్నీ ఉన్నా అమరకపోవచ్చు సంతోషం.
ఉంటుంది సంతోషం మనిషి దృక్పథంలో !

కలిమిలో లేకపోవచ్చు సుఖం !
లేమిలో కలుగవచ్చు సంతోషం !

సుఖం సంతోషాన్నిచ్చే
సాధనాల్లో ఒకట్కటి మాత్రమే.
సుఖం సంతోషానికి కావచ్చు అవరోధం.
అందుకే సుఖం కంటె సంతోషం మిన్న.

# అధికారం

అధికారం ఒక ఆయుధం
సరిగా ఉపయోగిస్తే దాన్ని !
సమకూర్చవచ్చు సర్వజన సంక్షేమాన్ని,
సంతరించవచ్చు సమాజాన్ని.

కై పెక్కిస్తుంది ఎందరికో సారా మత్తులా అధికారం,
గర్వాంధులు ధరిస్తే అధికారాన్ని పట్ట పగ్గాలే ఉండవు.

అధికార సద్వినియోగంతో
అవరోధాలు తొలగించవచ్చు
అవకాశాలు కల్పించవచ్చు, అవసరాలు తీర్చవచ్చు.
ఆశలు నెరవేర్చ వచ్చు, ఆశ్రయ మివ్వ వచ్చు.

అధికారం వజ్రంలాగా మెరిపిస్తుంది
ధరించేవారి, చూచేవారి కళ్ళను.

అధికారంలో ఉన్న బాధలు చూడాలంటే
అధికారంలో ఉన్న వారిని చూడాలి.
అధికారం లోని ఆనందాన్ని చూడాలంటే
దాన్ని వెతుక్కొనేవారిని చూడాలి.
అధికారంలో ఉన్న బాధలు నిజమైనవి,
దానిలో ఉన్న ఆనందం ఊహామాత్రమే !

# కవిత్వం

కనుగొంటాడు శాస్త్రవేత్త
శాస్త్రం ద్వారా ప్రపంచాన్ని
తెలుసుకుంటాడు కవి
సాహిత్యం ద్వారా జగాన్ని.

రవి గాంచని చోటు కవి గాంచగలడో లేడోకాని
కవి కనగలడు కన్నులు మూసుకుని దేనినైనా.

కవి వినగలడు చెవులు మూసుకొని ఏదైనా.
కవి కన్ను కట్టగలదు మన్నుకు మిన్నుకు వంతెన.

కవి కలం కల్పించగలదు ఉనికి లేని దానికి రూపం.
ఊహలకు ఛాయాచిత్రకారుడు కవి
మాటలతో మలుస్తాడు రూపాన్ని కవి.

ఊహా పక్షుల రెక్కలకు ఉచ్చులు వేస్తాడు కవి
సత్యానికి కూడా చేకూరుస్తాడు సౌందర్యాన్ని
కవి అక్షరాల దుస్తులతో.

ప్రకృతి సౌందర్యానికి భూతద్దం కవిత్వం
అందాన్ని ఇనుమడించి అందిస్తుంది కనుక.
యౌవ్వనాన్ని కవ్విస్తుంది కవిత్వం,
ప్రేమను ప్రేరేపిస్తుంది కవిత్వం.

కవిత్వం - కన్నీరు అక్క చెల్లెళ్లు అనీ
ప్రతి కన్నీటి చుక్క ఒక కవిత్వపు ముక్క అని
ప్రతి ఏడ్చేవాడు ఒక కవి అనీ -
అంటారు కొందరు.

లోక మంతా కవితామయం
గాలిలో కదులుతుంది కవనం
మేఘాల్లో మెదులుతుంది కవనం —

అలల్లో ఉయ్యాల లూగుతుంది కవనం
ఆలోచనలకు ఆయువు పోస్తుంది కవనం
మాటలకు మనుగడ నిస్తుంది కవనం
దిద్దుతుంది అందాలు దేవుని సృష్టికి కూడా కవనం.

కవి చేతుల్లో మారుతుంది
మట్టి కూడా మాణిక్యంగా,
కవి కలం తగలగానే
మాటలు పాటలు అవుతాయి,
పలుకులు తళుకులు అవుతాయి.

కవిత్వం పదాలలో సంగీతం
సంగీతం శబ్దంలో కవిత్వం.

# నేరం

సమాజం సృజిస్తుంది నేరాన్ని
మనిషి చేస్తాడు నేరాన్ని.

శారీరక జాడ్యం ఇస్తుంది అవకాశం
దయా, ధర్మాలకు
మానసిక రోగం (నేరం) చేస్తుంది దోహదం
పగ, ద్వేషాలకు.

అన్ని అలవాట్లలాగే అలవడుతుంది నేరం
నేరం అంటే అర్థం తెలియని పసి వయస్సులోనే.

చిన్న చిన్న తప్పులే
పెద్ద పెద్ద నేరాలకు దారులు తీస్తాయి.
అసలేమి తెలియని అమాయకుడు
అకస్మాత్తుగా హడలు గొలిపే
అపరాధాలు, హత్యలు చెయ్యలేడు.
నేరాలు చేయలేని వాళ్లు
నేరస్తులను అనుమానించనూలేరు.

నేరస్తుడిని దాచే గుహ లేనేలేదు జగతిలో
నేరం జరిగిందో, లోకమంతా అద్దాల భవనమే,
తడినేల మీద అడుగుజాడల్లాగ
అన్ని రుజువులు అద్దుకుంటాయి అమాంతంగా.

పేదరికమే నేరానికి తల్లి అయితే
తెలివి తక్కువ తనం దానికి తండ్రి,
మనిషి నేరాలే మనిషికి శత్రువులు
అతడిని నీడలా వెంటాడి
పడవేస్తాయి తాను త్రవ్వుకున్న గోతిలోనే.

నేరాలు ఒకదాని కొకటి దారితీస్తాయి,
దొంగ సంతకాల్లో ఆరితేరిన వాడు
దోపిడీలు మొదలు పెడతాడు.
మోసాల్లో నేర్పరి
ఖూనీల్లో దిగుతాడు.
నేరం వల్ల సౌఖ్యాన్ని పొందాలను కోవడం
తన రక్తంతోనే దాహం తీర్చుకోవాలనుకోవడం !

# శిక్ష

జీవితానుభవ సారత్వం
మంచైనా చెడైనా
చివరకు చేసినదానికి ఫలితం అనుభవించడమే !

శిక్ష ఆలస్యమైనా
వచ్చి తీరుతుంది ఏనాటికైనా.

రోగికి మందులాగే
నేరస్థుడికి శిక్ష అవసరం,

శిక్షలోని కఠినత్వం కంటే
శిక్షవల్ల భయం
నేరాన్ని ఆపగలుగుతుంది.

నేరాన్ని రూపు మాపాలంటే
శిక్షను చులకన చేయడంకాదు
శిక్షను భరించరానిదిగా చేయడమే.

కాని శిక్ష నేరస్థుడిని
కఠినుడిగా మారుస్తుంది.

నేరస్థుడిని న్యాయంగా శిక్షిస్తే
నేరస్థుడికి తలవంపులు -
శిక్షించకుంటే సంఘానికే సిగ్గుచేటు !

శిక్ష మనిషిని మార్చేలాగుండాలి.
ఉరితీస్తే మనిషే మిగలడు !

శిక్ష మళ్ళీ నేరాన్ని ఆపేలా గుండాలి.
శిక్షద్వారా నేరస్తుడిని మార్చే బదులు
నేటి సమాజం ఒకరిని శిక్షించి
ఇతరులను మార్చడానికి యత్నిస్తున్నది !

సరియైన పాఠశాలలు ఎంత ఎక్కువ వుంటే
బందిఖానాలు అంత తగ్గిపోతా యన్నారు పెద్దలు.
నేరానికి శిక్ష విధించే కృషిలో కొంతైనా
నేరంచేసే అవసరం లేకుండా చేయడానికి
వినియోగిస్తే ఎంతో బాగుండదా ?

నేరము, శిక్ష ఒక కొమ్మను కాసే పువ్వు, కాయలే.
తెలియకుండా నేరంఅనే పువ్వులో దాగిఉండే పిందే శిక్ష!

ప్రపంచ సాగరంలో జీవిత నౌకకు
రాతిగుట్టల్లాంటి నేరాలు తగులుతూనే వుంటాయి
దిక్సూచిలాంటి శిక్షలతో వాటిని తప్పుకోవాలి.

# కోకిల - హంస

కోకిల నలుపు-హంస తెలుపు
తెలుపుకు విలువ ఎక్కువ
నలుపుకు విలువ తక్కువా ?

దేవుడి దృష్టిలో
రంగు కొక విలువా ?
నలుపుకులేని నాణ్యం
తెలుపుకు తెచ్చిపెట్టిం దెవరు ?

నలుపు గురించి నవ్వడమా
తెలుపు గురించి తెగపొగడడమా ?

హంస నడకలో అందం వుంటే
కోకిల కంఠంలో మధురం లేదా ?

ఎందుకు రంగు విలువలు ఎంచడం ?
అన్ని రంగులు హంగులే
అసలు విలువ
ఆ రంగు క్రింది అంతరంగానిది కాదా ?

నలుపు తెలుపుల కలయికే
కాదా ప్రకృతి శోభ !

# బాల్యం

బాల్య మొక పవిత్ర స్వర్గం
అహర్నిశలు చింతలులేని జీవితం !

ఆటలు—పాటలు—ఎగరడం—దూకడం
తోచింది చేయడం—అనుకున్నది చెప్పడం

అబద్ధానికి—నిజానికి, తేడా తెలియకపోవడం
న్యాయమేదో అన్యాయమేదో
అర్థం తెలియకపోవడం—
ఉపకారంవల్ల ఒరిగే మేలు
అపకారంవల్ల కలిగే హాని
అంతుపట్ట కుండడం—
ఇది కావాలనీ-అది లేదనీ
ఇంటిలోని పోరు—ఇల్లాలి బంధం
అనే విచారం లేకపోవడం—

వ్యాపారం నష్ట మనీ
ఉద్యోగం ఊడిందనీ
అప్పులవాండ్ల గొడవలనీ
పన్నులవల్ల బాధలనీ
అసలే లేకపోవడం,

అంతా ఒక ఆనందమయమైన స్వప్నం !
ఊహించలేని అమాయకపు స్వర్గం !

కాని—
చేయిజారి పోతుంది బాల్యం చెప్పకుండా
అది స్వర్గమని తెలిసే టప్పటికే !

# ముసలి తనం

అరవై ఏండ్లు దాటగానే
చిగురిస్తాయంటారు మళ్ళీ
చిన్నతనపు కోర్కెలు,
చేయా లనిపిస్తుంటారు
చిలిపి చేష్టలు !

అల్లరిపిల్లల జీవితాన్ని
అనుభవించా లనీ
తొలినాటి అనుభవాలను
తిరిగి పొందా లనీ
ముసలితనం
గుసగుస పెడుతుందంటారు !

షష్టిపూర్తి పేరుతో చేసుకుంటారు
మళ్ళీ పెళ్ళి పండుగ
విందులు, వింతలు, వినోదాలు
అనుభవించడానికి చిన్న తనాన్ని నెమరు వేసుకుంటూ
కొడుకులు కోడళ్ళకు కొత్త తనమిస్తూ-
మనుమలు, మనుమరాళ్ళకు
మనసులు చిగురింపజేస్తూ !

పళ్ళుడూడినా, తల నెరసినా
చూపు తగ్గినా, నడక సడలినా
మనసు మాత్రం
మరువదు కుర్రతనాన్ని,
వయసు ముదిరినా
వగరు చావ దంటారు !

కాని ముందుగా తెలిపి వచ్చేది
ముసలితనం ఒక్కటే అయినా
తయారుకాడు మానవుడు
ముసలితనాన్ని ముచ్చటగా ఆహ్వానించడానికి !
పసరుకాయను పండి రాలనీయడానికి !

అనుభూతులనే బరువు మోసే బ్రతుకుబండి
ముదిమి అనే మిట్ట ఎక్కలేక
బాల్యం అనే పల్లంలోకి లాగుతుందేమో !

# గగుర్పాటు

హోరుగాలి తుఫానులో
ఓడ ఒరగిలేటప్పుడు,
కళ్ళు తిరిగే కొండలోయ వంకర రోడ్డుపై
కారు బ్రేకులు వదులైనప్పుడు,
కటిక చీకటి రాత్రిలో
గండుబిల్లి మిటకరింపు కళ్లు తారసిల్లినప్పుడు
కారడవిలో హఠాత్తుగా పంజా ఎత్తి
గర్జించే పెద్దపులి పైకి గాండ్రించి దూకేటప్పుడు,

సినిమాల్లో లాగా నిజ జీవితంలో
మనం ప్రయాణించే కారు అమాంతం ఢీకొన్నప్పుడు
అల్లరి మూకలు రైలుస్టేషనుకు నిప్పంటించగా
అందులో మనం చిక్కుకున్నప్పుడు—

పిరికివాళ్ళు అమావాస్య నడిరాత్రిలో
శ్మశాన వాటికలో ఒంటిగా వెళ్ళవలసినప్పుడు,
ఆకాశంలో గంటకు అయిదువందల మైళ్ళ వేగంతో వెళ్ళే
విమానాన్ని 'హైజాకర్' మళ్ళించిపిస్తోలుగురిపెట్టినప్పుడు
కలిగే అనుభూతి ఎలా ఉంటుంది ?
ఓమాటు గగుర్పాటు కలిగించదా ?

# భక్తి

భక్తిలో ఉందంటారు బహుగొప్ప శక్తి
భక్తి ఎవరికి ఎప్పుడు ఎలా పుట్టుకొస్తుందో
భగవంతుడుకి తెలియదేమో కాని
భక్తులకు మాత్రం బాగా తెలుసు !

కష్టాల్లో ఉన్ననాడే కనిపిస్తాడు దేవుడు
ఆనాడు వెతుకుతారు దేవుడెక్కడ దాక్కున్నాడో అని
చేస్తారు భజనలు, ఉంటారు ఉపవాసాలు,
కావిస్తారు పూజలు, చెల్లిస్తారు ముడుపులు
అన్నీ సరిగా ఉన్ననాడు అసలు జ్ఞప్తికేరాడు దేవుడు !

కొండలెక్కేది కోర్కెల తీర్పులకే అయితే
స్వార్థపరులంతా పరమ భక్తులే!

భక్తికి భజనలు, ప్రసాదాలు ప్రధానమా
ఆసక్తితో ఆరాధన అవసరమా ?

కొబ్బరికాయ కొట్టడం (కుళ్ళినదైనా)
కోనేటిలో తలముంచడం (మురికి నీరైనా)
మంత్రాలు గొణగడం (అర్థం కాకున్నా)
మనిషి గుళ్ళో ఉండడం(మనసెక్కడున్నా)
అవుతుందా భక్తి - వస్తుందా ముక్తి?

పని కావాలంటే దేవుడ్ని భూషించడం
పని కాకుంటే ఆయన్ను దూషించడం !

ఎంత విపరీతమైన వైనా కోర్కెలు తీరిస్తేనే దైవం
తీర్చలేకుంటే మరి దయ్యం !

# నింగి - నేల

ధరలు నింగి కెగ్గాయి చీకటి వ్యాపారుల భుజాలనిచ్చెనపై
నరులు నేలనే ఉన్నారు జీవితాలు గడుపుతూ నిత్యంపస్తులతో!
నల్లధనం విలువ నలువిధాల పెరుగుతూ తాకుతుంది నింగిని
తెల్ల గుణం విలువ తేలిపోయి తరుగుతూదిగుతుంది నేలకు!

పండే పాపం పలువిధాల పెరుగుతుంటే నింగికి
ఎండే పంటలు తరుగుతున్నాయి నేలమట్టానికి!
ఖర్చులు ఆకాశం అందుకుంటుంటే
వచ్చే ఆదాయం పాతాళానికి ప్రాకుతుంది!

అంగట్లో ఉన్నట్లే ఉండి
అన్నిసరుకులు చీకటి సందుల్లోకి దూరుతుంటే,
నింగికి పెరిగే ధరలతో పోటీగట్టి
పరుగిడలేక నేలపైనే ఉన్నాడు
నిస్సహాయుడు, నిరాయుధుడు, నిరుపేద మానవుడు!

# కవి సహృదయా!

కవి సహృదయా! కనువిప్పరా!
లోకంపోకడ కనరా! పేదల శోకం వినరా!

ఎల్లకాలం వల్లవి ఒకటేనా?
రతీమన్మథుల కథలు, రాణివాసాల రసికత్వాలేనా?

కోటల ఎత్తును, అగడ్తల లోతును
వినువీధులు తాకే మేడలను, వింతవింతగా వర్ణించడమేనా?

తా మెచ్చినది రంభ, తా మెచ్చనివాడు రావణుడు,
కాళీయ మర్దనం, కంసుని మరణం!

ఋషుల కోపాలు, శాపాలు, పతివ్రతల అగ్నిప్రవేశాలు
అవేనా ఆధారాలు మనకు కథా వస్తువులు?

ప్రజల గోడు మరి ఇక ప్రతిబింబించే దేలా?
తోటి మానవుని జీవిత సమస్యలు
సూటిగా కాలేవా కవితా వస్తువులు?

కవివిప్పితే ఊహానేత్రం
సముద్రపులోతును కొలువవచ్చు
ఆకాశపు ఎత్తును అంచనా కట్టవచ్చు
అణువును చీల్చవచ్చు!

ధర్మదాతల దానాలు పొగడవచ్చు
నాయకుల హెచ్చులు మెచ్చవచ్చు
చేతలకెన్నో హేతువులు చూపవచ్చు
పిల్లిని పులిగా-తిమ్మిని బెమ్మిగా మార్చవచ్చు!

కర్షకుని కడగండ్లు కానగలమె ?
కష్టజీవి కన్నీరు తుడవగలమె ?
పేదల బాధలు బాపగలమె ?
ఆకలిగొన్నవానికి పట్టెడన్నము
వస్త్రహీనుడికి జానెడు పేలిక
మండుటెండలో మాడువాని కింత నీడ
విద్యావిహీనునికి అక్షరజ్ఞానం యివ్వగలమె
మన కలాలకు పదును పెట్టకుండా
మన దృక్పథం కొంతైనా మారకుండా ?
ప్రతి నిత్యం పేదవాని బ్రతుకు బాటకు
పాతుతుంటే ముళ్ళకంచెలు
నిద్రపోయాయా మన కలాలు ?
అమాయకుల నిలువునా దోస్తుంటే
అన్యాయాలు బాహాటంగా జరుగుతుంటే
ముసుగువేసుకొని,
మూలన కూర్చుండి పోయాయా మన కలాలు ?
ప్రజారాజ్యం ఫలించలేదా కలంశక్తితో
ప్రజాస్వామ్యం – ప్రజాక్షేమం ఫలించవా
పాడితే కలం గళం విప్పి?
మనం పలికే పలుకులు కదిలించాలి మనుషులను
చెప్పేమాటలు చేయాలి దోహదం చేతలకు
జరుగుతున్న దొకటైతే వ్రాస్తున్నది మరొకటైతే
కాదా కళంకం మన కలాలకు ?
రాదా అవమానం మానవత్వానికి ?
ఓ ! కవి సహృదయా, నీ కలం పదునుపెట్టరా!
రవిచూడనిచో టేదో ప్రజకు చూపెట్టరా !

# జాషువా

నవయుగ కవిచక్రవర్తీ!
నవ్యాంధ్ర వాఙ్మయ విశారదా!
పద్మభూషణా! కళా ప్రపూర్ణ బిరుదాంకితా!

తెలుగు భాషకు తెచ్చావు వెలుగు
ప్రజల భాషకు పెట్టావు మెరుగు
పడశావు ఆంధ్రుల మన్నన
వ్రాశావు ఫిరదౌశి, గబ్బిలం, ముంతాజ్ మహలు.
సృజించినావు ఎన్నో ఖండకావ్యాలు.

కారే కవులు వ్రాయరే వ్రాతలు
వారేరీ ఈనాడు?
వ్రాశారు వారు తోచింది తమకు.
వ్రాశావు నీవు మానవకోటి మనుగడ గూర్చి,
మరువలేదు నీవు మనిషిని, మానవత్వాన్ని

గిజిగాని, సాలీని, తుమ్మెదలపాఠాలు
నేర్పావుమానవుడికి.
అందించాడు కాళిదాసు
ప్రయోజనంలేని ప్రియుని సందేశాన్ని
మేఘునిద్వారా ప్రియురాలికి.

అందించావు నీవు పేదవాండ్ల గోడును
గబ్బిలం ద్వారా పరమేశ్వరునికి.

కాదా నీ 'గబ్బిలం' గణనీయం, ప్రశంశనీయం?
లేదా నీ కన్నీటి సందేశంలో నివాళి మానవాళికి?

# మనిషికి మనిషి

సృష్టికే మకుటం మనిషి
మనిషి చంద్రమండలాన్ని చేరగలడు
అంగారక గ్రహాన్ని అందగలడు
అగ్నిని కూడా దగ్ధము చేయగలడు!

ప్రకృతిని పలువిధాల పట్టివేయగలడు
అమృతాన్ని కురియగలడు, విషాన్ని కక్కగలడు,
ప్రతి జీవరాశికీ మనిషి మనిషే
మనిషికి మాత్రం మనిషి కాదు మనిషి.

మనిషిని మృగంగా చూసేవారికి
మన సమాజం కనిపిస్తుంది కారడవిగా.
మనిషికి విలువ కట్టాలంటే చూడవలసింది
మనిషికున్న ఆస్తిపాస్తులు, నగలు నాణ్యాలుకాదు
మనిషిలోని గుణగణాలను. నీతి నియమాలను.

మనిషికి ఎంతో అవసరం మనిషి
అయినా మనిషిని చూస్తున్నాడు మనిషి
అసూయతో, అమానుషంగా, అనుమానంతో!

మనిషికీ మనిషికీ మధ్య త్రవ్వుకుంటున్నాం
అంతులేని అఘాతాలు.

పెంచుకోవడానికి బదులు ఆప్యాయతలు
త్రుంచుకుంటున్నాం అనురాగబంధాలనే.

మనుషుల మనసులు, వారి మనసుల మసలికలు
మనిషి తెలుసుకుని మసులుకో గలిగితే
మనిషి మనిషిని ద్వేషించడం మాని ప్రేమించగలిగితే
అమానుషత్వం మాని మనిషిని మనిషిగా చూడగలిగితే-

మనిషికి మనిషి చేదోడు వాదోడుగా ఉండగలిగితే
మనుషుల మనసులు అమృతకలశాలు కాగలిగితే—

మారదా మనలోకం
కాదా శాంతికి నిలయం
మానవతకే ఆలయం !

# న్యాయం

అర్హతను బట్టి ఇవ్వడమే న్యాయం.
న్యాయం గ్రుడ్డిది అంటారు కొందరు
దానికి స్నేహితులు, బంధువులు కనుపించరు గనుక,
పక్షపాతం లేకుండా చూస్తుంది గనుక.
ఇరుపక్షాలను విననిదే వీలుగాదు న్యాయం చేయడానికి.
న్యాయాధికారులు, వాది ప్రతివాదులను, వకీళ్ళనుగాక
వివాదాంశాల్ని మాత్రమే విన్నప్పుడే
తీర్పు ఉంటుంది న్యాయంగా.
నిష్పక్షపాతం న్యాయానికి ప్రాణం
న్యాయాన్యాయాల పోరాటంలో
కావాలి న్యాయానిదే అంతిమ విజయం.
న్యాయం విలువ బాగా తెలియడం
అన్యాయాల బాధలు రుచి చూచినవారికే, !
న్యాయం నిజంగా చేయాలంటే
మనం నిర్భయంగా ఉండగలగాలి.
అన్నిటికీ జంకేవారు అన్యాయాన్ని ఎదిరించలేరు.
"సకాలంలో జరగని న్యాయం
అన్యాయం క్రింద లెక్కే" అంటారు పెద్దలు.
న్యాయం దేశానికి పుష్టికరమైన భోజనం
అన్యాయం ఔషధంలేని కుష్టురోగం !
న్యాయానికి మూలస్తంభాలు
న్యాయాధిపతులు, న్యాయవాదులు అయితే
ప్రజానీకమే దానికి పునాది రాళ్ళు !

# సంవత్సరాది

ఏదో ఉంది కొత్తదనం సంవత్సరాదిలో !
అదేదో అనిపిస్తుంది మరి పాతను వీడాలని
సరికొత్తను చేపట్టాలని !

నిరుడు అనుకున్నది
ఈ ఏడైనా అమలు పరచాలని
వచ్చే ఏడైనా పచ్చగా ఉండాలనీ
నిన్నగన్న కలలన్నిటినీ
రేపు కార్యాలుగా మార్చాలనీ !

ప్రతి సంవత్సరాదినాడు
ఒక ప్రగతి మెట్టు ఎక్కాలనీ
నిన్నటివరకు పెరుగుతున్న దుఃఖాన్ని
సన్నగిల్ల చేయాలనీ
తరుగుతున్న సుఖాన్ని
నేటినుంచి పెంచాలనీ !

పనికిరాని పాతను వీడాలనీ
అనుకూలమైన కొత్తను చేపట్టాలనీ
అనిపిస్తుంది సంవత్సరాదినాడు.

లేకుంటే కాదా దండుగలు
ఈ కొత్త వత్సరాదులు ?
ఏటేటా వచ్చే ఈ ఉగాదుల పండుగలు ?

# ఆటల పోటి

వ్యాపార మనే ఆటల పోటీలో
అన్నిటికన్నా మిన్న అధికలాభాల ఆట !

ఆట చీకటి విధానంలో ఆడినా
దొంగ చాటుగా గోల్ కొట్టినా
పొందే ఫలితం అధికలాభమే !

సరుకుల వంపిణీ సంగీతంలో
అదికలాభాల పాటలే ఆధునిక బాణీలు.

ప్రాణ రక్షణకు కావలసిన మందుల్లో
ప్రాణాలుతీసే కల్తీ విషపదార్థాలే
ఈ సంగీతంలో సరిగమ స్వరాలు !

మెదడులోని మెలికలు
చేతి మలుపుల మసలికలు
కనురెప్పల మాయ కదలికలు
ముసుగులోని గుసగుసలు
అధికలాభాల ఆటలపోటీల్లో రహస్య భాషలు
వారి విజయానికి సోపానాలు !

ఈ అధికలాభాల ఆటల పోటీలో
ఆటగాళ్లు తామే, అంపైర్లు తామే !
అందుకనే ఓడిపోయేది ఎప్పుడు
నోరులేని పేద ప్రజానీకమే !

# పెళ్లి

పెళ్ళి ఇద్దరు వ్యక్తుల మధ్య కలయిక
రెండు జీవితాల మధ్య సమైక్యత.
ప్రేమ ప్రధానం కావాలి పెళ్ళికి.

పెళ్ళికి ఫలితం జీవితాంతం అల్లుకునే అనుబంధం,
పెళ్ళికాదు పిల్లల బొమ్మలాట
అది ఎల్లకాలం స్త్రీపురుషులను
జంటగా నడిపే బ్రతుకుబాట. !

తగినవారిని పెళ్ళాడినప్పుడే
దక్కుతుంది సుఖం పెళ్ళివల్ల,

ఎందరో జల్సారాయుళ్లు
వెనుకంజ వేస్తారు పెళ్ళి అంటేనే
వివాహ బంధపు బాధ్యత అంటే భయపడి.

అన్ని విధాల సతీపతులు అమరాలంటే
అసలు పెళ్ళే కాకపోవచ్చు!
ప్రేమకు, పిచ్చికి, పెళ్ళి మందు అంటారు,
త్వరపడి పెళ్ళాడితే
నిదానంగా చింతించాలి అంటారు !

పెళ్ళి ఇతరులకు సంబంధం లేనిది అయినా
అందరిజోక్యానికి గురి అయ్యేది పెళ్ళే.

సమాజాన్ని చక్కనిమార్గంలో
నడిపేవాహానం వివాహం!
పెళ్ళివల్ల కలిగే సుఖసంతోషాలు
భార్యాభర్తల పరస్పర త్యాగాలే.

పెళ్ళి ఒక మంచి ఔషధం
అది పనిచేస్తుంది పలువిధాలుగా.
సుఖసంతోషాలను
కష్టసుఖాలను కూడా విశాలపరుస్తుంది పెళ్ళి!
మంచి భార్య దొరకడం
తుఫానులో ఓడకు మంచి రేవు దొరికినట్లు,
చెడ్డభార్య రేవులోనే తుఫానులాంటిది!

రెండు శరీరాలు, రెండు జీవితాలు
సుఖదుఃఖాలను పంచుకొంటూ
కడవరకు ప్రయాణించడం కంటే
ఆశించతగింది మరేముంది?

భర్తను బట్టి భార్య లాగే
భార్యను బట్టి భర్త!

# త్రాగుడు

మనిషి త్రాగుతాడు సారా మొదట
మనిషినే త్రాగుతుంది సారా పిదప !

మొదటి పెగ్గు ఆరోగ్యానికి, ఆనందానికి
రెండవ పెగ్గు సరదా, సంతోషాలకు
మూడవ పెగ్గు ముద్దుముచ్చట తీర్చవచ్చు—కాని
నాల్గవ పెగ్గు నవ్వుల పాలుచేస్తుంది నలుగురిలో !

త్రాగుడు గుణం స్పాంజీ (పాచి) లాంటిది
ఎంత ద్రవాన్నైనా పీల్చేస్తుంది.

త్రాగితేనే నిజం చెప్పుతారు అనేది
త్రాగడానికి కనిపెట్టిన ఒక మంచి సాకు !
నిజం చెప్పనివాడు త్రాగి చచ్చినా నిజం చెప్పడు !

పానశాల బ్యాంకులాంటిది-ఒక్క తేడాతో
బ్యాంకులో దాచింది వస్తుంది వడ్డీతో తిరిగి
పానశాలలో బ్రతుకే పోతుంది మునిగి !

ఔషధంగా త్రాగేవాడు, ఆపుకోగలడు వలసినప్పుడు.
త్రాగడానికే త్రాగేవాడు ఆపుకోలేడు
అకాశం విరిగిపడినా !

వెతుకుతాం సులభ మార్గం
తలదాచుకోవడానికి సారా సీసాలో,
పిరికితనం, అసంతృప్తి, విచారాలనుండి,
కాని మునిగిపోతాం అందులో
మళ్ళీ తేలకుండా బిరడా బిగించుకుని !

# గర్వం

ఇతరులకన్న తానే మిన్న అనుకోవడం గర్వం.
ఆత్మస్తుతి, పరనింద గర్వంవేసే వెర్రితలలు.

అజ్ఞానం గర్వానికి ఆహారం
అహంభావం గర్వానికి పీఠం.

గర్వం పెంచుతుంది పైవారిపట్ల ద్వేషం
క్రిందివారిపై నీచభావం
తోడివారిపై అసహనం.

తినడం త్రాగడం కానేరదు తప్పు
అందులోని "అతి" మాత్రమే గర్హనీయం.
గర్వంలోనూ "అతి" పాత్ర అంతే గమనార్హం!

గర్వం దుర్గుణాలకు ద్వారం
తమలో తప్పు కనుపిస్తుంది గర్వం అందరిలో!

ఇంటికి అటకలాగా మనిషికి గర్వం
ఉన్నా అన్నిటికంటే పైనే
ఉండేది దానినిండా చెత్తా చెదారమే!

పొగడ్తలో కావించిన మంచి పనులు
గర్వమనే కారుమబ్బుల్లో కప్పబడతాయి.
గర్వానికి పొగడ్త అగ్నికి నెయ్యి లాంటిది.

అయినా
విషంలాగే గర్వం అతిచిన్న మోతాదులో అవసరం,
తనసుగూర్చి తనివి పొందలేనివాడు
ఇతరులగూర్చి సంతోషించలేడు గనుక.

# విశ్రాంతి

పనికీ పనికీ మధ్య పొందే విరామానికే
ముద్దు పేరు విశ్రాంతి,
పనిచేయకుండా ఉండడం కాజాలదు విశ్రాంతి !
మనోవికాసానికి కావాలి మార్పు, విరామం
పనిలో మార్పును సాధిస్తే ప్రకృతికి అనుగుణ్యంగా
పొందవచ్చు విశ్రాంతిని ధారళంగా,
శ్రమ అనే దాహానికి విశ్రాంతి ఒక చల్లనిపానీయం !
కొందరు కోరుతారు తిండి, బట్ట
మరికొందరు వాంఛిస్తారు ధనం, ధాన్యం
కాని అందరికీ ఎంతో అవసరం విశ్రాంతి !
విశ్రాంతిని పనితో సమన్వయిస్తేనే విలువ,
విశ్రాంతి విశ్రాంతి కొరకే అయితే అది
భరించలేని యాతన !
విశ్రాంతి చేకూరుస్తుంది శ్రమకు వలసిన శక్తికిని,
క్రమబద్ధమైన విశ్రాంతివల్ల
కార్యభారాన్ని సులభంగా నిర్వహించగలం.
విరామం, శ్రమ తగుపాళ్ళలో కలిస్తేనే
అవుతుందది కార్యసాఫల్యానికి మార్గం.
విశ్రాంతి ఉంటుంది మన హృదయంలోనే
వెతక నక్కరలేదు ఎక్కడా !
అన్ని శ్రమలు పడడం
ఆఖరుకు విశ్రాంతిని పొందడానికే !
జీవితంలో ప్రవహించే శ్రమల నదులన్ని
చివరకు కలిసేది విశ్రాంతి సాగరంలోనే !

# ఆకాశం

ఆకాశం అంటేనే శూన్యం
అందులో లేదేమీ అన్యం !
అయినా ఆకాశం నిండా అనేక రంగులు.

నీలి రంగుల మేలి ముసుగుల్లా
తేలియాడే పిల్ల మేఘాలు.

నేలను నింగిని కలిపి కుట్టే
పట్టు అంచుల్లాంటి మబ్బు తునకలు.

మేఘాల పొదరిళ్ళలో నుంచి
మెరుస్తాయి చుక్కల పువ్వులు.

జాబిల్లి వెండి పళ్ళెరంలోని కర్పూరం
అందిస్తుంది జగతికి చల్లని వెన్నెల.

సుందరాంగి కుంకుమ బొట్టులా
సూర్యబింబం ఎగజిమ్ముతుంది సౌభాగ్యాలెన్నో.

మిన్నుమీది మేరుపు తీగ చిన్ననాటి స్వప్నంలాగ
తళుక్కుమని మెరిసి పోతుంది.

ఉరుములతో కూడిన హోరుగాలి
భోరున కురిసే కుంభవర్షం
జావురు మనిపిస్తాయి భయపడే పిల్లల్ని.

నిజానికి మన బ్రతుకులాంటిదే ఆకాశం
ఎన్నో ఉన్నట్లు అనిపించి,
ఏమీ లేకుండా ఉంటుంది.

గోళానికీ గోళానికి మేళవింపుగా
ఆలోచించి వేసిన అందాల నిచ్చెన ఆకాశం !

ఆకాశం అంతులేని శూన్యపేటికే అయినా
అదొక అర్థంకాని మయసభ కూడా,
ఔను ఆకాశం అంటేనే శూన్యం !
అందులో లేదేమీ అన్యం ! !



శ్రీలింగం మాలకొండయ్య M.A;I A S (ఎం.ఏ.ఐ ఏ ఎస్). జననం 1927, చదువు మద్రాసు లయోలా కళాశాల. విద్యార్థిగా నిత్యం ప్రథమ శ్రేణిలో ఉంటూ అనేక బహుమతులను పాఠశాలలోనే గాక సాహిత్య, సాంస్కృతిక, కళారంగాల్లోను పొందారు. రష్యన్ భాషలో సీనియర్ డిప్లొమా (**Senior Diploma in Russian**), ఎకనామిక్ డెవలెప్‌మెంట్‌లో పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమా (**Post graduate Diploma in Economic Development**) (నేపిల్స్, ఇటలీ) పొందారు. హిందీ, తమిళ భాషలలోనే గాక జర్మన్, ఇటాలియన్ భాషల్లో ప్రవేశాన్ని సంపాదించారు.

1949-50 లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేసి 1950 లో డిప్యూటీ కలెక్టర్‌గా, అప్పటి అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ప్రథమ శ్రేణిలో సెలెక్ట్ అయ్యారు అనేక జిల్లాలలో డిప్యూటీ కలెక్టర్‌గా, జిల్లా ప్లానింగ్ ఆఫీసర్‌గా పనిచేసి, కరీంనగర్, తూర్పుగోదావరి జిల్లాలలో కలెక్టర్‌గా, మైనింగ్ మొదలుగాగల ప్రభుత్వ కార్పొరేషన్‌లలో మేనేజింగ్ డైరెక్టర్‌గానూ పనిచేసి ఉత్తమ పాలకులుగా పరిపాలనా దక్షతను, ప్రజాసేవా ధురీణతను ప్రదర్శించి, ప్రజల మన్ననలనుగొని, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఎక్స్టెన్ కమీషనర్‌గా ఉంటున్నారు.

వీరు అనేక పత్రికలకు వివిధ అంశాలపై వ్యాసాలు తెలుగులో, ఇంగ్లీషులో వ్రాశారు. ఆకాశవాణి, దూరదర్శినికి వీరు వ్రాసిన పాటలు ప్రేక్షకలోకాన్ని ఆనందింపజేసి వారి మన్ననలను పొందాయి.

# కయ్యాలు

కయ్యానికి కాలుదువ్వే వాళ్లు
తోటాలు నింపిన తుపాకులు,
ఎప్పుడంటే అప్పుడే పేలవచ్చు !

తప్పంతా ఒక్కరిదే అయితే
కయ్యానికి కారణమే ఉండదు.

కయ్యం అనే పొయ్యిలో
బూతులనే బొగ్గులు పోస్తే
అది చిమ్మే నిప్పురవ్వలు
తన ముఖం పైకే చిందితే
చింతించి లాభంలేదు.

విరోధులమధ్య కయ్యాలు
తీస్తాయి ఇద్దరి ప్రాణాలు
చేస్తాయి లాభం మధ్యన వకీళ్ళకు.

కయ్యానికి బహుళః కారణాలుండవు
కారణాలు తెలిస్తే కయ్యాలే ఉండవు !